# శో భ న పు రా త్రి

## (న వ ల)

ర చ యి త లు :

ఓగిరాల సుబ్రహ్మణ్యాం
కప్పగంతు రంగయ్య

ప్ర తు ల కు
శ్రీ నవ్యకళా మండలి
క ర వ ది

# కల్పనాశిల్పం

ఈ విరోధి వత్సరానికి స్వాగతమిచ్చి, 'దీక్ష' ఖండ కావ్యమును తొలి పుష్పంగా ఉగాదికి అర్పించాము. ఈనాటికి దసరా కానుకగా ద్వితీయ పరిమళపుష్పం నవల రూపంలో 'శోభనపురాత్రి' గా వెలువడినది. ఇవి ఈ సంవత్సరంలో ఇంతవరకు మా 'నవ్యకళోద్యానసీమ'లో పూచి, వికసించిన పరిమళసహిత కుసుమములు.

నేడు మన సాహిత్యంలో వెలువడే నవలలు చాలా వరకు శృంగారమయమై, అసభ్యసంభాషణలతో నిండి, శీల నిర్మాణంలో మాలిన్యానికి మార్గం చూపుచున్నవి. ఆ నవలల మూలంగా అటు విజ్ఞానము లభ్యం కాదు — ఇటు వినోదించటం జరుగదు. అమూల్యమైన విశ్రాంతికాలమును ఏదోవిధంగా వృధాగా వినియోగించటమే చివరకు కలిగే ప్రయోజనం—ఫలితం. నవరసములలో శృంగారానికి ఎంతో ప్రాముఖ్యమున్నది. దానిని కట్టుబిట్టాలతో, హద్దు గమనిస్తూ నవలలో ప్రవేశపెట్టడం వుచితం—ఉత్తమం. ఈ నవలలో చదువరులకు వినోదం, విజ్ఞానం లభ్యమయేటట్లుగా కలం నడిచినది. అదే ఈ నవలలోని ప్రత్యేకత.

నిత్యజీవితంలో అడుగడుగునకు వ్యక్తిని ఎదుర్కొనే కొన్ని సమస్యలను, కొన్ని సందేహాలను, ఆ యా సందర్భాలలో వాని మనోభావాలను విపులంగా వివరించాము. సమయోచితముగా విజ్ఞానకరమై సుధలొలికించు పలుకులను,

తొలిరేయి—తొలిసంగమంలో స్త్రీపురుషులు గమనించి, గ్రహించవలసిన విషయాలను అందందు కొద్దికొద్దిగా ముచ్చటించాము. ఇది కల్పనలోని శిల్పం. అంటే కల్పనాశిల్పం.

నవలా రచనలో ఇప్పుడే తొలి అంకం ప్రారంభించబడినది. ఇందులో చాలాదూరం అసత్యానికి అందుబాటులో లేకుండా సహజంగా కథ నడిచినది. ఇవి ఇప్పటి భావాలు. కాలం గడిచేకొలది నూతన అనుభవాలతో క్రొత్త విషయాలను నేర్చుకొనటం జరుగుచున్నదని గమనించి, గ్రహించి కల్పనా శిల్ప సౌందర్య వీక్షణకు ముందుకు కదలండి.

అడిగినంతనే తగు సహాయము చేసి, ఈ రచనను పాఠకులకు అందించిన బాల్యమిత్రులు శ్రీ తుమ్మల వెంకట రెడ్డి గారికి ధన్యవాదాలు. వీరు మా రాబోవు రచనలకు కూడా ఈ విధముగానే తగిన ప్రోత్సాహ మొసంగుదురు గాక !

—రచయితలు

భాషాభిమానులు, బాల్యమిత్రులు, ద్రవ్యదాతలు

**శ్రీ తుమ్మల వెంకటరెడ్డి గారికి**

ప్రేమపూర్వకముగా ఈ రచనను అందిస్తున్నాము.

—రచయితలు

# 1

అల్లారు ముద్దుగా పెంచుకొన్న ఆశాలత ఎండిపోయి నది....ఎన్నటికైనా చిగురించి ఫలించుతుందనే ఆశ కూడా అడుగంటినది. తన వూహలకు సరిపోయిన ఒకని జీవితములో ఆమె భాగం పంచుకొన్నది. ఆమె ఇష్టమే తమ కర్తవ్యమని తల్లిదండ్రులు తలచిరి కాబట్టి అన్నపూర్ణ కోరిక సునాయాసంగా అనుకూలంగా నెరవేరినది. ఆనందరేఖలు అప్పుడప్పుడే జీవితంలో అన్నికోణాలనుండి వ్యాపిస్తున్నవి. ఇంతలోనే ఒక చుక్క రాలిపోయినది. వెనువెంటనే కన్నీటి బిందువులు టప టప మన్న చప్పుడయినది.... అన్నపూర్ణ ఆనందజ్యోతి ఆరిపోయినది. దుఃఖోపశమనానికి ఆదరముతో తండ్రి అన్నపూర్ణను ఆహ్వానించెను.

అన్నపూర్ణ యింటిప్రక్కనే ప్రసాదు ఇల్లు. ప్రసాదుకు అన్నపూర్ణ అంటే చెప్పనలవికాని ఆనందం కలిగేది. తనకు సోదరి లేని లోటు ఆమె తీర్చిందని సంతోష పడేవాడు. అప్పుడప్పుడు ఆ అన్న, చెల్లెలు ఒండొరుల కష్టాలను చెప్పుకొనుచు ఆలోచనలో మునిగిపోయేవారు. అది చూచి ప్రసాదుతల్లి మురిసిపోయినది. అన్నపూర్ణ ఆశాజ్యోతి ఆరిపోయినందుకు ప్రసాదు పరితపించెను. చెల్లెలుకు తాను చేయగల్గిన సహాయం ఏమిటా యని విరామకాలంలో విచారించేవాడు. కాలచక్రం కడు వేగముతో కదలిపోయినది. కొన్ని రోజులు గడచినవి....మరికొన్ని మాసములు దొర్లిపోయినవి.

ఆ రోజు అన్నపూర్ణ తలంటిపోసుకొని ప్రసాదు గృహమునకు వచ్చినది. ప్రసాదు గది ఖాళీగా వున్నది. మంచం మీది పుస్తకం అన్నపూర్ణ అందుకొని పుటలు త్రిప్పినది. ఒకచోట పొంకంగా "మనోహరి—ప్రభ" అని వ్రాసిన దానిమీద ఆమె నేత్రాలు వ్రాలినవి. వెంటనే మెదడులో విద్యుత్ ప్రవహించింది. మనసులో భావాలు దొర్లిపోయినవి. పర్యవసానం ప్రభ ఎవరా అనేది అయోమయమైనది. ఆ పుస్తకం తీసికొని అన్నపూర్ణ లోనికి నడచినది. ప్రసాదు కనపడలేదుగాని వాని తల్లి కనుపించినది.

"పిన్నీ ! అన్నయ్య ఎక్కడకు పోయినాడు ?"

"ఎక్కడకూ పోలేదమ్మా. దొడ్లో పూల మొక్కలకు నీళ్ళు పోస్తున్నాడు. ఈ రోజు పెందలకడనే వచ్చావే. ఏమిటీ విశేషం ?"

"ఇంట్లో ఏమీ తోచకపోతే అన్నయ్యతో కులాసాగా కబుర్లు చెప్పుకొని కాలక్షేపం చేద్దామని వచ్చా.

"సరేలే, తల్లీ! దొడ్లోకి పో."

కూనిరాగాలతో నీళ్ళుపోస్తున్న ప్రసాదు అన్నపూర్ణను చూచి రాగాలాపనకు స్వస్తి చెప్పాడు.

"అన్నయ్యా! నేనుకూడా చెట్లకు నీళ్ళుపోస్తా."

"వద్దులే చెల్లీ! ఈ రెండు మొక్కలకు నీళ్ళుపోసి వస్తా. నీవు ఆ రాతిమీద కూర్చో."

"నీవు ఒక్కడవే ఆ ఆనందం అనుభవించాలా?"

"అదిగాదు చెల్లీ! నీకు శ్రమ దేనికని అడ్డుచెప్పాను. నీకు కులాసాగావుంటే నా అభ్యంతరం దేనికి?"

"నీవు నీళ్ళుతోడు. నేను కడవతో ప్రతి మొక్కను స్నానం చేయిస్తా."

"అట్లాగే. నీ వుత్సాహమే నా సంతోషం. ఆలస్యం చేయకుండా పని ముగించకపోతే అమ్మపిలుపు అంతరాయం కలిగిస్తుంది."

అన్నపూర్ణ చేతిలోని పుస్తకం ప్రసాదు చూచి "అదేం పుస్తకం? అన్నపూర్ణా" అన్నాడు.

"నీ గదిలో మంచంమీద వుంటే తెచ్చాను."

"ఓహో, అదా. నీవు దానిని తప్పక చదవాలి. అందులో అమూల్యమైన వ్యాసాలు అందరికీ అర్థమయ్యేటట్లు వ్రాశారు. విజ్ఞాన వికాసానికి, కాలక్షేపానికి సరిగా తూకం యిస్తుంది."

"అన్నయ్యా, విడువకుండా చదువుతానులే. నా మెదడు పనిచేయని విషయాలు నీవు వివరించాలి. దీనికి ఒప్పుకొంటావా?"

"సరే. ఆపుస్తకం ఆ రాతిమీదవుంచి కడవ తీసుకో. నేను నీళ్లు తోడుతా."

ఆ అన్న నీళ్లుతోడటం, ఆ చెల్లెలు పూలమొక్కలు తడపటం. అన్నిమొక్కలకు అన్నపూర్ణ నీళ్లుపోసినది. ఇంతలో 'అన్నపూర్ణా' అంటూ ఒక యువతి వచ్చి వారి పనికి ఆటంకం కలిగించినది.

"ప్రభా! ఏమిటీ విషయం? ఊరకే రారు మహానుభావులు" అంటూ అన్నపూర్ణ నవ్వినది.

"నీతో ఏకాంతంగా ముచ్చటించే విషయాలు మెండుగా ఉన్నవి. ఆలస్యానికి అవకాశం లేదు. దయచేసి తమరు ఒకసారి రావాలి" అంటూ ప్రభ ప్రసాదువైపు చూచినది. కాచుకొనియున్న ప్రసాదు ఆ చూపులతో తన చూపులను కలిపి అనిర్వచనీయమైన ఆవేశంతో ఆనందాన్ని అనుభవించాడు. విద్యుత్ప్రవాహము క్షణములో ఆగిపోయినది. ప్రసాదుచూపులకు స్వాగతమిచ్చిన ప్రభ లజ్జతో శిరమువంచి అన్నపూర్ణవైపు చూపు మరల్చినది. ఈ నయనసందేశ తరంగాలు ఆకస్మికముగా జనించి అంతలోనే అణిగిపోయినవి కాబట్టి అన్నపూర్ణకు ఈ విషయం అర్థంకాలేదు. ఒకవేళ తెలిసికొని మౌనం దాల్చిందేమో! ఫలితంమాత్రం ప్రసాదు ప్రభలు ఒకరి నొకరు ఆశతో చూపులద్వారా పరీక్షించుకొన్నారు. ఈలాటి ఘట్టాలు చాలా జరిగినవి. ప్రభ ప్రసాదుల మధ్య పరిచయము అంకురముగుండా అవతరించిన లతలాగా పెరుగుచున్నది. కాలచక్ర గమనంవల్ల వారి కోరికల పర్యవసానం ఏమగునో?... దీన్ని కాలమే నిర్ణయించాలి.

"ప్రభా! పోదాం పద. అన్నయ్యా! సాయంత్రం వీలుగా ఉంటే వస్తా. ఈ లోగా నీ పుస్తకాన్ని చదువుతా" అంటూ అన్నపూర్ణ ప్రభతో వెళ్లినది.

క్షణం క్రింద సంతోషంతో మిళితమైన మందహాసాలు మరుక్షణంలో హృదయవేదనతో కూడిన చింతనతో ఐక్యమైనవి. కొన్నాళ్లు ఆనందం—కొన్నాళ్లు దుఃఖం. ఏమిటో మాయ. ఈ మాయ రంగస్థలంలో మానవులు నటకులు. ఇక వారి నటన......?

ప్రభ ఎవరు? ప్రసాదుచరిత్ర ఏమిటి? ఇవి తెలిసికో వలసిన అంశాలు. మన నిత్యజీవితములో నిరంతరము ఆటు పోటుల్లాగా ఎత్తు పల్లాలు ఏర్పడుతున్నవని ప్రసాదు గ్రహించటం జరిగినది. ఉన్నతపాఠశాలలోని విద్యను సమూలంగా నేర్చుకొని ఉత్తీర్ణతను సంపాదించాడు. కళాశాలలో కాలుమోపితే కుటుంబము కుంటుపడుతుందేమోనని ఆశను నిరాశ చేసికొన్నాడు. గొప్ప గొప్ప డిగ్రీలు కుప్పలుగా దొరికే ఈ కాలంలో తనకు డిగ్రీ లేనిలోటుకై అతడు చింతించలేదు. విజ్ఞానము అతనియెడల విముఖత చూపకపోవటమే అతని మనోనిగ్రహానికి, సహనానికి కారణం కాబోలు. పెద్దలు సంపాదించియిచ్చిన ఆస్తి ఉన్నదికాబట్టి ఓమోస్తరుగా జీవితం గడుపుతున్నాడు. ఇది ఒక కోణంలో నుంచి తొంగిచూస్తే వాని భంగపాటును చాటే దృశ్యం.

వేసవికాలంలో పల్లెటూరి ప్రశాంత జీవితముపై అభిరుచి యేర్పడి ప్రసాదు స్వగ్రామానికి వచ్చాడు. ప్రభ యౌవనవతి. పేరును సార్థకము చేసికోగల ప్రతిభ ఉన్నది. ప్రభను చూచి వివాహమైనదేమో నని ప్రసాదు నొచ్చుకొన్నాడు. అందుబాటులోని ముత్యాన్ని అందుకోలేక పోయినా ననే చింత వాని హృదయగోళాన్ని ఆవరించుకొన్నది. కాలు కాలితే గాని నివురుగప్పిన నిప్పని తెలిసికోలేనట్లు జరిగిన తర్వాతగాని మానవుడు జారిపోయినదాని పవిత్రాపవిత్రతలను యోచించడుగా అనుకొన్నాడు. చివరకు ప్రభకు వివాహము కాలేదని తెలిసికొన్న తర్వాత వాని మనసు కుదుట పడినది.

ప్రసాదుమిత్రులలో రామం ఒకడు. రామం మొదట అందరిచేత అసహ్యించుకోబడ్డ వ్యక్తి. కాని, అనుకొనని మార్పు కొన్నాళ్ళకు అతనిలో జరిగినది. శీలానికి ప్రాధాన్యాన్నిచ్చి జీవితమును చక్కని, తిన్నని పట్టాలమీద ఒడిదుడుకులు లేకుండా రాముం నడిపించ గలిగాడు. శీలనిర్మాణంలో చాకచక్యం చూపే సామర్థ్యం వానిలో ఉండబట్టి రామం పరిచయానికి ప్రసాదు ప్రాకులాడాడు. రామం గృహానికి పోవటంలో ప్రసాదు ప్రభను చూడటం తటస్థించినది. ఈ అనుదిన అవలోకనా అవకాశమే ప్రసాదు హృదయఫలకంపై ప్రభచిత్రాన్ని చిత్రించినది. నాటినుండి వాని హృదయంలో అంతులేని భావాలు ఉత్పన్నమయి పోరాటాన్ని లేపి ఆరాటం కలిగించినవి.

ఒకనాడు ప్రసాదు ఒంటరిగా కూర్చొని ఆలోచించెను— ఎన్నాళ్ళు ఈ చూపులు? చూపులేగాని మాటలు లేవా? మాటలులేని చూపులతో మరులుకొల్పి బాధించటమేనా ఈమె ఉద్దేశ్యం? చూపులవల్ల కలిగే బాధ, వ్యథ తెలిసికొని ప్రవర్తిస్తున్నదా? ఎన్నాళ్ళు ఈ దాగుడు మూతలు? కోరికను ప్రకటించి హృదయ తాపాన్ని తగ్గించుకొనటమా? నిజందాచి తేనెపూసిన కత్తిలాగా ప్రవర్తించటమా? ఏది కర్తవ్యం? ఏది అనుసరణీయమోగ్యం? నిజం బాహ్యమైతే నలుగురిలో నగుబాట్లు, పదిమందిలో పకపకలు. మానావమానములు లక్ష్యంలో ఉంచుకొని కోరికను అణచుకోవాలా? లేదు. ఆశించినదానికై యత్నించటం ముఖ్యం. యత్నమే మానవజన్మ లక్ష్యం. ఈ ఆలోచనలతో ప్రభకు లేఖ వ్రాయాలని నిశ్చయించుకొన్నాడు.

ప్రభా!

ఎన్నాళ్ళనుండో దాగియున్న అనురాగాన్ని నీ హృదయ వీణపై ఆలాపిద్దామని అవకాశానికి వేచియున్నా. నీ వదనారవిందంలో నూతన సొబగునుగూర్చే ఆ చిరునవ్వులో నా మందహాసాన్ని శృతి తప్పకుండా మేళవించుదామని నీ స్వాగతానికి ఎదురుచూస్తున్నా.

పరిమళభరితమైన పుష్పాన్ని ఏరి, కోరి, చెట్టునుండి కోసి దాని సౌందర్యాన్ని, సౌరభాన్ని మెచ్చుకొంటాము—అనుభ

విస్తాము. కాదని ఆ పుష్పాన్ని అట్లాగే ఉంచితే ఆ దినం కాకపోయినా మరునాటికయినా అది నిర్యాణం చెందుతుంది. ఏ మార్గంలో నడిచినా దానికి నాశనం తప్పదు. అట్లాంటి సమయంలో చెట్టునుండి కోసి, సున్నితంగా, జాగ్రత్తగా వాడుకోవాలి. ఇది సృష్టిలోని మూలధర్మం. అడవిలోని వెన్నెలవలె యౌవనాన్ని నిరర్థకం చెయ్యవద్దు. సుమములోని మకరందాన్ని ఆస్వాదించటం భ్రమరానికి సహజగుణం. నది ఏ మారుమూలనో పుట్టి, చీలికలై, పాయలై ప్రవహించి సాగరంలో కలిసిపోతున్నది. ఏదో ఆశయనిర్వహణానికి జీవిత యాత్రను గడిపి గమ్యాన్ని చేరుకోనటం, లేదా విముఖులై పోవటం మానవ జనన మరణాలలోని కీలకం.

వాడకముందే ప్రసూనంలోని పరిమళాన్ని అనుభవించి ఆనందించాలి. అందువలన ఉభయజీవితాలకు శాంతి లభిస్తుంది. ఒక కెరటం లేచినది. రెండో కెరటంగూడా లేచి సహకారభావాన్ని స్మరింపజేస్తుందో లేదో ?

నీ అధరచుంబన అభిలాషి,

ప్రసాద్

లేఖ వ్రాయటం పూర్తిచేసి దాన్ని మడిచిపెట్టాడు. విస్తారమైన ఆకాశంలో కారుచీకట్లే సంచరిస్తాయా ? చంద్రికా చంద్రులే విహరిస్తారో ? ఎవరు చెప్పగలరు ?

# 2

దసరా పండుగకు అల్లుండ్రంతా వేచియున్నారు. వారి నిరీక్షణకు కారణం? భిన్న భిన్న అభిరుచులు, రక రకముల ఆలోచనలు. కొందరికి ఈ అవకాశంద్వారా తమ ప్రణయమూర్తులను—అభిలషించి అనురాగామృతాన్ని ఆస్వాదించుటకై ఏరుకొన్నవారిని—విశాలవిస్వసంచారానికితోడుగా కోరుకొన్నవారిని—చూడవచ్చునుగదా యనే ఆశ. ఆశలు, ఆలోచనలు, అభిరుచులు భేదించినప్పటికి సామ్యం సతీ సౌందర్య విలోకనమే. ఈ సమూహములో రఘు ఒకడు.

మామగారి ఆహ్వానాన్ని అందుకొనిన రఘు ఆనందానికి అంతులేదు. పెండ్లి అయినతర్వాత విజయను చూచుటకు వీలులేకపోయినది. వివాహానికి ముందు తాను కనిన కలలు నేడు యథార్థరూపంలోకి వచ్చినవిగదా యని విరామ కాలంలో గతాన్నితల్చుకొని భావిని ఆలోచించేవాడు రఘు. మరునాటి ఉదయం బండిలో ప్రయాణమగుటకు తీర్మానించుకొన్నాడు. దుస్తులు సరిచేసికొని, ఒకసారి అద్దంలో ప్రతిబింబాన్ని చూచుకొని కాలేజీకి బయలుదేరాడు. ఉపన్యాసకుల బోధన, విద్యార్థుల వాదన వానిచెవి కెక్కలేదు. గడియారం నాలుగుగంటలు చూపగా కాలేజి వదలి గది చేరుకొన్నాడు.

ఇక విజయ విషయం విచారిద్దాం. పండుగకు పతి వస్తాడని ముస్తాబు చేసికొన్నది. వివాహమైన తర్వాత విజ

యలో మార్పు కలిగినది. ముఖములో నూతనమైన తేజస్సు, అవయవములలో లావణ్యం, నయనములలో అయస్కాంతత్వం, నూతన అవయవముల విజృంభణ—ఇవన్నీ కలిసి విజయను యౌవనవతిగా అలంకరించినవి. మేలిముసుగుస్థానం సిగ్గు ఆక్రమించుకొనినది. రఘు తనను గుర్తిస్తాడో, లేడో నని ఆందోళన పడినది.

ఆ యింటిముందు ఆగిన బండిలోనుండి రఘు దిగినాడు. వెలుపలికి వచ్చిన విజయ రఘును చూచి లోనికి పరుగెత్తినది. రఘు మెట్లెక్కి లోనికి వస్తుండగా రాజమ్మ కాళ్లు కడుక్కో మని నీళ్లిచ్చినది. అత్త ఆజ్ఞనిర్వహణానంతరం పడకకుర్చీలో రఘు కూర్చోగా కుశలప్రశ్నలు పూర్తి అయినవి. విజయ కోసమై రఘు దిక్కులుచూచెను. కాని, తలుపు సందునుండి చూచే విజయ రఘుకు ఎట్లా కనుపడుతుంది ?

రఘు వచ్చినపుడు మామగారైన మాధవరావు ఊరిలో లేడు. మాధవరావుకు విజయ, వేణు తప్ప వేరు సంతానము లేదు. వారి యింటివెనుక చక్కని పూదోట విశాలంగా వ్యాపించి ఉన్నది. సాయంత్రం కాగానే ముద్దుల బావమరది వేణుతో తోటలోనికి బయలుదేరాడు. తోట లోని జలాశయంవద్ద విజయ కూర్చొని మాల కడుతున్నది. ఏదో మిషపై వేణును లోనికి పంపి రఘు తానొక్కడే ముందడుగు వేశాడు. సన్నజాజిపూలను వాసన చూస్తూ నిదానంగా, నెమ్మదిగా విజయను రఘు సమీపిస్తున్నాడు.

పతిరాకను గమనించిన విజయ పూలమాలను అతపైకివిసరి 'విజయా' అంటూ పిలిచే అతని పిలుపును గమనించకుండా సిగ్గుతో పరుగెత్తినది. రఘు పుష్పమాలను గ్రహించి, ఒక్క సారి హృదయానికి హత్తుకొని ఆఘ్రాణించాడు. శోభాయ మానమైన ఆ చెండుసౌందర్యం గమనిస్తూ ఆలోచించాడు. "సౌందర్యభరితమై, మృదువైన ఈ పూలమాలవలె నా యౌవనాన్ని నీ కర్పించబోతున్నా. అమృతాన్ని తొణికించ కుండా ఆగి ఆగి త్రాగి ఆనందించు" అని చెండుద్వారా విజయ తనకు సందేశాన్ని అందజేసిందని ఆలోచనాఫలితంగా రఘు గ్రహించటం జరిగినది. బావగారిని ఒంటరిగా వదలి ఎందుకు వచ్చావన్న తల్లిమందలింపుతో వేణు తోటలోనికి నడిచాడు. ఆ బావమరుదులు ఏమేమొ చెప్పుకొని నవ్వుతుంటే విజయ మేడపైనుండి తొంగిచూస్తున్నది. ఆనాడు ఆవిధంగా గడిచినది.

... ... ...

కళాభవన్‌లోని "ముందడుగు" చిత్ర అవలోకనానికి బావమరదులు బయలుదేరారు. బుకింగువద్ద జనం గుంపులు గుంపులుగా బారులుతీర్చి ఉన్నారు. కుర్చీటిక్కెట్లు తీసికొని లోనికివచ్చి రఘు, వేణు, ఆట మొదలుపెట్టటానికి కొంత వ్యవధి ఉన్నదని చిత్రకళనుగూర్చి ప్రసంగించసాగిరి.

"వేణూ! ఈ కళాభవన్ ఎవరి యాజ్ఞలో నున్నది?"

"మనవీధిలో నుండే పెద్ద మేడలోని పార్థసారథిగారిది. వారు తెలివిగలవారు, కళారాధన అంటే వారికి చాలా యిష్టం."

"వేణూ! కొందరు అభిమానుల ఉనికిచేతనే కళ సజీవంగా ఉంటూ కొన్ని లోపాలను సవరించుకొనుచు అభివృద్ధి చెందుచున్నది. అటువంటిసమయంలో కళారాధకుల మాట చెప్పవలయునా? ఏమి మన స్తత్వమో కాని లలితకళలలోని చిత్రకళ, కవిత్వములకు ప్రజలు ప్రాధాన్యాన్నిచ్చి వాని అభివృద్ధికి పాటుపడటంలేదు."

"బావా! ఒక దేశచరిత్రకు చిత్రకళ, కవిత్వము ముఖ్యమైనవి గదా? 'చిత్రకారుడు, కవి'—వీ రిరువురు లేకుంటే ఆనందానుభూతితో కళామయమై, శోభాంకురమైన ప్రకృతిని తెలిసికోలేము. అసలు విషయమునుగూర్చిన విజ్ఞానమే లేకుంటే దానిలోని మాధుర్యాన్ని, ప్రభను తిలకించి తల పంకించే దెట్లా? చిత్రకారుని కుంచె, కవికుమారుని లేఖని సర్వత్రా సంచరించి మరుగుపడి మూలచేరినవానిని బయటకు లాగి మానవ జీవిత వికాసానికి వానిని అనుభవ యోగ్యంగా చేయగలవు."

"వేణూ! నీవు చెప్పినది నిజమే. అతిశయోక్తి అందులో లేదు."

"సరే. బావా, చలనచిత్రప్రదర్శనశాలలు చక్కగా లేనప్పుడు లోటుపాట్లను ఈ యజమానులు సరిచెయ్యరు.

వీరికి ధనంమీాదనుండే కొంత ప్రదర్శనశాలల బాగోగులపై నుండదు. పైగా 'సర్వే జనాః కాంచనమాశ్రయంతి' అంటూ సమర్థిస్తారు. ఓపికతో వచ్చిన ప్రతిచిత్రానికి హాజరగుతారే కాని అచట తమకు సౌకర్యం లేదని ఈ ప్రేక్షకులు గోల పెట్టరు. ప్రేక్షకుల ఒత్తిడిలేకుంటే ప్రదర్శనశాలలు నానాటికి హీనస్థితికి వచ్చునేమో! "

"నీవు చెప్పినదానికి ఈ ప్రదర్శనశాలకు చాలా దూర మున్నది— ఈ యజమాని ప్రత్యేక శ్రద్ధ తీసికొనటమే అందుకు మూలం."

ఇంతలో మొదటి గంటమ్రోగి వారి సంభాషణకు అంతరాయం కలిగించినది. తమ ప్రసంగాన్ని నిలిపి వారుభ యులు మౌనంగా కూర్చున్నారు. చిత్రము ప్రారంభింప బడగా అందులోని సొబగును, కథావస్తువుకూర్పును, విషయ విన్యాసమును, నిర్మాణచాతుర్యమును సునిశితబుద్ధితో వారు గ్రహించారు. ప్రదర్శనము పూర్తి అయినది. బావ మరదులు నడకప్రారంభించారు. ఆకాశంవిచ్చియున్న మల్లె పువ్వులాగా ఉన్నది. ఆ మరునాడు ... ... ...

వేణు మెట్లెక్కి మేడమీాదికివస్తూ "బావా, ఏకాం తంగా ఏమిచేస్తున్నావు? ఏదైనా సందేశాన్ని అందజేసే యత్నంలో నున్నావా?" అని రఘు ప్రక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు.

"వేణూ, కాలచక్రం తన గమ్యాన్ని చేరుకోటానికి గమనాన్ని హెచ్చిస్తుంది. గడిచిన దినము తిరిగిరాదు. ఒక రోజు వృథాగా గడిపితిమా జీవితములోని ఒక అమూల్య దినమును తృణప్రాయంగా ఎంచి పోగొట్టుకొన్నట్లే. అందుకే కాలచక్రపు గమనాన్ని అనుసరిస్తూ కాలం సద్వినియోగం చేసికొనటం వివేక లక్షణం. అందులో విజ్ఞానానికి మూల మైనది పుస్తకపఠనం."

"బావా, కాలచక్రపుగమనాన్ని మనం అనుసరించ లేము. మంచి మార్గంలో కాలాన్ని వినియోగించవలెనని నిత్యము మనం అనుకొనటం సహజమే."

"అదే పొరపాటు. కాదంటే గ్రహపాటయి అలవా టగుతుంది. భాషణకు, ఆచరణకు అంతులేని ఎడమున్నది. ఈ భేదమేలేకుంటే మానవజీవితంలో ఎత్తుపల్లాలు గోచ రించవేమొ. చెప్పినది తూ. చా. తప్పకుండా ఆచరించటం దుస్తరం."

"బావా, విరామకాలం పుస్తకపఠనంలో వినియో గించటం మంచిదంటవా?"

"వేణూ, సారస్వత మాధుర్యాన్ని నిస్సారంచేసి భాషకు తీరని ద్రోహముచేసే వారి రచనలను వెలివేయాలి. కట్టుదిట్టాలతో కమ్మని పదసముదాయమును ఉన్నత భావా లలో దూకించి, కాలంతోపాటు ముందుకుసాగుచు ప్రజ

లలో విజ్ఞానజ్యోతిని వెలిగించగలవారి రచనలనే రుచి చూడాలి. ఆ రచనలే ప్రజలకు, భాషలకు ఎంతగానో సేవ చేసి నీరాంజనాలందుకో గలవు."

"బావా, ఈకాలంలో రకరకముల నవలలు బయలు దేరినవి. జంపన, చలం, యిత్యాదుల నవలలు విపణివీధిలో వెలిగిపోతున్నవి. మరి వానిమాట?"

"వేణూ, సందర్భాలను ప్రకృతిసౌందర్యంతో సంబంధపరచి విశాలభావాలతో వ్రాస్తారు. ఇది జంపనవారి మాట. చలం రచనలను ముఖ్యంగా యువతీ యువకులు, తార్కికులు, చదివి ముందడుగు వేయాలి, క్రొత్తప్రపంచాన్ని దరహాసచంద్రికలచేత నింపించి నిర్మించాలి. విషయాలు అందుబాటులో లేకపోయినా కొంత యత్నించితే సాధించవచ్చు. కొంత త్యాగం జరిగితేనేగాని వారిభావాలు మన ఆదర్శాలయి ఆచరణీయములుకావు. ఇది వారికీ మనకు గల పరస్పరభావవైరుధ్యమే. అది వారి అనుభవం కాబట్టి అతిరమణీయంగా చిత్రించియుండవచ్చు.

"బావా, రచనానిర్మాణం గుత్తవరకమా! మన తెనుగుభాషలో ఉన్నతగ్రంథాలు ప్రజలకు అందుబాటులో గలవి విరివిగా లేవు. ఆ సమయంలో మనము ఈ విధంగా మడికట్టుకొని మూలచేరితే ఎట్లా?"

"వేణూ, కొందరు పత్రికా సంపాదకులు సంచరించే విధానం చూస్తే రచనానిర్మాణం అలాగే ఉన్నది. వారికి

మరుగుపడిన మాణిక్యంలాంటి రచయితలకు ఇనాలోక యోగం కలిగిద్దామనే చింతే లేదు. అసలు వారి దృక్పథమే వేరు. పేరుగాంచిన రచయితల రచనలను పత్రికటిస్తే తమ వ్యాపారం నిరాటంకంగా సాగుతుందని, తమ బొక్కసాలు నిండుతవని వారి ఆలోచన. రచనలో మెరుగున్నపుడు పక్షపాతం చూపకుండా ప్రకటించాలి. రచయితలు కూడా మేల్కొని, కథావస్తువుకూర్పును శృంగారంతో నేనింపకుండా కల్పనను కొంత వినియోగించి దైనిక జీవితఘట్టాలను రమ్యంగా రచించాలి. కల్పనను అల్పంగా ప్రయోగించి సహజత్వాన్ని సంహరించకుండా దృశ్యాలను దృశ్యంచేయాలి. ఈ పంథాలో కలం సాగి హృదయమాలిన్యాన్ని తొలగింపచేయాలి. ”

“ బావా, అభిప్రాయాలు అన్నీ బాగా ఉన్నవి. కథ నడిచే దెట్లా ? ”

“ ఇందుకొరకే విజ్ఞానచంద్రికాగ్రంథమాల, సరస్వతీ గ్రంథమండలి, రసతరంగిణీ గ్రంథమాలలు రంగంలోకి వచ్చినవి. ప్రతి విజ్ఞానవంతుడు భాషాసేవ చేయాలి. సహజాతుల సామరస్య విహీనతవల్ల అందరూ ఈ రంగంలో నటించ లేరు. అయినా ప్రయత్నించి ఓపినకొలది భాషాసేవ, తద్వారా ప్రజాసేవ చేయటం సముచితం. ”

“ ఈ విషయాలకు స్వస్తిచెప్పి క్రిందికి పోదాం పద ” అంటూ వేణు రఘుతో గదినుండి నిష్క్రమించాడు. యవనిక క్రిందికి జారినది. నిశ్శబ్దత సర్వత్రా అలుముకొన్నది. తిరిగి రంగస్థలంలో నటకులు దృశ్యమా అవకాశ మెప్పుడో ?

# 3

పట్టణపు పరిచయ మూలంగా ప్రతిసాయంత్రం వారిరువురు వాహ్యాళికై బాహ్యానికి బయలుదేరటం పరిపాటి అయినది. ఆ రోజు అస్తమించుచున్న అరుణ బింబాన్ని వీక్షిస్తూ మౌనభావం దాల్చిన ఆ ప్రవాహ ప్రాంతపు విశాల బయలులో ఇసుకమీద కూర్చొని చల్లని పిల్లవాయువు స్వాగతాన్ని అందుకొంటూ మిత్రులైన రామం ప్రసాదులు కబుర్లు చెప్పుకొనుచున్నారు.

"ప్రసాద్, శశాంకునికి అవకాశం యిస్తూ ప్రభాకరుడు తన కాంతిపుంజాన్ని ఉపసంహరిస్తున్న ఆ దృశ్యం మనస్సుకు హాయి గలిగిస్తున్నది. అర్థంకాని రంగుల కలయిక పరిణామంగా ఏర్పడిన ఆ బింబము అంతకంతకూ తరిగి పోతున్నది" అంటూ రామం ఏదో వ్యక్తం చేయబోతాడు. ఇంతలో ప్రసాదు ఆ అవకాశాన్ని అందుకొని "రామం, నటకుడు పాత్ర నిర్వహణ కోసం రంగంలోనికి ప్రవేశిస్తూ నిష్క్రమిస్తుంటాడు. ప్రవేశించిన నటుడు నిష్క్రమించక పోతే ఆగంతకునికి అవకాశరహితంతో కథావస్తువు కుంటు పడుతుంది" అని అంటాడు.

"ప్రకృతిలో ఎన్నాళ్ళనుండో దాగుకొనియున్న విషయాలు మెదడు ఉపయోగిస్తే విశదమౌతవి. ఈ బింబం మూలంగా అభివృద్ధి-పతనం, వెలుగు-చీకటి, ఉదయం—

అస్తమయం... ఈ రకంగా అనేక విషయాలు జంటలుగా వున్నట్లు గ్రహించవచ్చు."

"రామం, నీవు చెప్పినది యదార్థం. అణువుమొదలు పరస్పరసంబంధంతో కొన్ని జంటలు వుండటంవల్ల జగన్నాటక ఇతివృత్తం అడ్డులేకుండా కదలిపోతున్నది. ఆ యితివృత్తానికి మంగళగీతంతో ముగింపు ఎప్పుడో విశదం కావటంలేదు. బహుశా దానికి గమ్యస్థానము లేదేమో!"

"ప్రసాద్, పతనం అనే పదంతో అభివృద్ధి కలుగక లేకుంటే చరిత్ర ఆగిపోతుంది. చరిత్ర అంటే మానవుల యత్నమే. నిరాశాజీవితానికి ఆశ అనేది లేకుంటే వాడు ఆ నిరాశతో నశిస్తాడు. అంతటితో కథ త్వరగా ముగుస్తుంది. అందువల్లనే ఆశ అనేది నిరాశతో కలిసి మెలిసి కాపురం చేస్తున్నది. ఆశ అనేది ఉన్నప్పుడు పతనం, తద్వారా ప్రయత్నం, ప్రయత్నానుకూలతతో అభివృద్ధి కలుగుతున్నది."

"అసలు విషయం— భాస్కరుని ఉదయం, అస్తమయం వలె మన జీవితంలో సుఖదుఃఖాలు ఉన్నవి. వ్యక్తిగత ప్రయత్నాలవల్ల వాని ఛాయలు నిత్యజీవితంలో ప్రతిఫలిస్తున్నవి."

"సరే. ప్రసాద్, ఆ విషయాలను అంతటితో ముగింపు చేద్దాం."

"రామం, చిత్రకారుడు కష్టించి మనోహరంగా చిత్రాన్ని చిత్రించి మెరుగుకోసం అక్కడక్కడా చెమికీ అద్దాడు. ఆ చెమికీ సాంగత్యంతో ఆ చిత్రం ప్రభను నలువైపులా ప్రసరింపచేయటానికి తగిన వెలుగు అవసరం. వెలుగు లేకుంటే ఆ చిత్రం ప్రకాశించదు. అదేవిధంగా అవకాశం అనుకూలించకపోతే వ్యక్తిలోని ధీశక్తి ఉపయోగరహితమగుతుంది. ఈసంబంధం నా ప్రస్తుత అవస్థను నిరూపిస్తున్నది."

"నీవు ఉద్యోగానికి ప్రయత్నిస్తున్నావని మీ అమ్మ చెప్పినది. ఆ విషయం ఎంతవరకు వచ్చినది?"

"ప్రయత్నం అనేది ఉత్సాహంకొద్ది జరుగుతుంది. కార్యానుకూలతకు ఉత్సాహానికి సంబంధం లేకుండా ఉన్నది."

"ప్రసాద్, అంతగా కష్టించితే గాని ఉద్యోగం దొరకదా?"

"రామం, ఉద్యోగపు చింత లేకపోవటంవల్ల నీ రోజులు ఒడిదుడుకులు లేకుండా దొర్లిపోతున్నవి. తగిన సంపద ఉండటమే నీ జీవితపూర్ణిమకు కారణం."

"ఉన్నవాడు, లేనివాడు అనే వ్యత్యాసం లేకుండా ప్రతి వ్యక్తి ఉద్యోగవ్యామోహానికి దాసుడు కావటంవల్లనే నిరుద్యోగసమస్య ఉత్పన్నమైనది. ఇంతకూ మూలం విద్యాబోధన, విద్యావిధానములోని లోపములు."

"నీవు చెప్పినది నిజం. ఇప్పటి విద్యవలన లభించేది విజ్ఞానంకాదు. ఏదోవిధంగా ఒక యోగ్యతా పత్రం. అంటే ఒక డిగ్రీ సంపాదించటం."

"విద్యయెడ విద్యార్థి దృక్పథంలో మార్పురావాలి. దానికితోడు విద్యాబోధనలోను, విద్యావిధానంలోను కొంత నూతనత్వం కనుపించాలి. విద్య,విజ్ఞానవికాసానికి, స్వేచ్ఛాజీవనానికి పునాదులను నిర్మించిననాడే ఈ సమస్య అంతరిస్తుంది."

"ఇప్పటివరకూ జరిగిన నా కథ ఇది—పత్రికా ముఖములో గోచరించిన ప్రతి **'Wanted'** కు ప్రయత్నించా. ఆ కార్యాలయాల్లోగూడా లంచగొండితనం ప్రబలిపోయినది నా మనసు దానికి వ్యతిరేకం కావటంవల్ల ఫలితంశూన్యం. అయినది."

"ఈ లంచగొండితనానికి ప్రతి వ్యక్తి బాధ్యుడే. తన పని తొందరగా కావటానికి, తనకు అనుకూలం కావటానికి, తను తప్పించుకోటానికి ఈ మధ్య లంచగొండి అనే శక్తికి వ్యక్తి ప్రాణం పోశాడు. ఇస్తామంటే తీసికోనివారున్నారా? కాలక్రమేణా ఇది తప్పనిసరి అయినది. ఒక ఆచారంగా పరిణమించి, పరిగణించబడినది."

"ఇంకొక మాట. మన యోగ్యతలు, అనుభవాలు నిష్ప్రయోజకములు. ఉద్యోగానికి ముఖ్యంగా కావలసినది **Recamendation.**"

" ఏమిటో ఉద్యోగం అంటున్నావు. మా బావ కాకినాడలో వుద్యోగం చేస్తున్నాడు. ఒకటవతారీకు వచ్చేటప్పటికి ప్రతివాడు పీక్కుతినేవాడు. వస్తువులు అప్పు యిచ్చిన కోమటి, గుడ్డలుతికేచాకలి, పాలమనిషి వగైరాలు హాజరు. ఆయన తెచ్చినది వారికి ఇవ్వటంతో సమాప్తి. మర్నాటి నుంచి అప్పుకోసం బయలుదేరటం. ఇది ఆయనను ఎగతాళి చేయటం కాదు. విషయం బోధపడటానికి ఒక ఉపమానం— ఒక తార్కాణం."

"రామం, ప్రస్తుతం 'ఏమిచేయుదునా యనేది' విషమ సమస్య అయినది. 'బ్రతకలేనివాడు బడిపంతు లన్నట్లు' ఉపాధ్యాయపదవి అయినా లభిస్తే కొంత లాభం కలుగుతుంది. అయినా ఈనాడు ఉపాధ్యాయునికి సరియగు వేతనం లేదు. పైగా వుపాధ్యాయపదవికి గౌరవంలేదు. ఉపాధ్యాయుడు ప్రతివారికి పరిహాసపాత్రుడు."

" ప్రసాద్! సంఘసేవకు, జీవనానికి ఆ పదవిలో పలుకుబడి వున్నది. గౌరవం అనేది ఒకరివ్వటంవల్ల లభించేది కాదు. మన శీలంవల్ల, మన ప్రతిభావిశేషంవల్ల, మన కర్తవ్య నిర్వహణవల్ల అదే లభిస్తుంది. ఆత్మగౌరవాన్ని నశింపు చేసికోకుండా అణకువతో మెలగితే విశిష్టత స్వయంగా వచ్చి గళసీమలో పుష్పహారం అలంకరిస్తుంది."

" రామం, నీ సలహా ననుసరించి ఉపాధ్యాయపదవికి కంకణం కట్టుకొంటాను."

"ప్రసాద్, మరియొక మాట. ఉపాధ్యాయవృత్తి సుకరమైనది కాదు. విద్యార్థులను ప్రజా నాయకులుగా, భావిచరిత్రకు ఆధారభూతులుగా తయారుచేయగలిగినవాడు ఉపాధ్యాయుడు. మొదటినుండి వారి శీలంలో శ్రద్ధచూపుచు, వారి శ్రేయస్సుకొరకు పాటుపడి, వారిని ప్రతిభావంతులుగా తీర్చి దిద్దగలవాడు ఉపాధ్యాయుడనేది మనసులో వుంచుకొని ఈ కార్యభారమును వహించు."

"రామం, ఇవి తెలియని విషయములు కావు."

"విషయాలు పరిచితములైనా వీనిని ఆచరించి, యశస్సును గడించమని చెప్పుతున్నాను. ఈ విషయాలను విస్మరించితే నీలో ఒక విశిష్టత తొంగిచూస్తుంది. నీవు ఆదర్శప్రాయుడ వగుతావు."

"అవసరానికి తగిన హంగు వుంటే కాని కార్యక్రమాన్ని జయప్రదంగా కొనసాగించలేము. ఇప్పటి విద్యాలయాల స్థితి కొంత మారితేగాని నీవు చెప్పినట్లు నడవటానికి వీలు కలుగదు."

"ఇప్పుడిప్పుడే ప్రభుత్వం దృష్టి ప్రధాన కేంద్రమైన విద్యాలయాలపై ప్రసరించబడినది. శీఘ్రంగా పాఠశాలలు బాగుపడవచ్చును. దేశ సౌభాగ్యానికి, వ్యక్తిగత అభివృద్ధికి, సంఘోన్నతికి, సర్వజనశ్రేయస్సుకు తగిన అవకాశం కల్పించే టట్లుగా విద్యావిధానం సంస్కరించబడుతుంది."

అరుణబింబము అంతర్ధానమై చాలా కాలం గడిచినది కాబోలు. వృద్ధిచంద్రుని కిరణాలు సర్వత్రా వ్యాపిస్తున్నవి. ఆ వెన్నెలలో కొంతసేపు వారిరువురూ కూర్చొని ప్రసంగాన్ని మరియొక మార్గంలో నడిపించారు.

"రామం, నీ కల్పనాశక్తి ఏ కావ్య నిర్మాణంలో మునిగి యున్నది ?"

"ప్రసాద్, ఇపుడు కావ్యరచనకు శెలవు యిచ్చి, కథానికలను చిత్రించి పత్రికలకు పంపుతున్నా. పత్రికా ప్రకటనకు ఒక కథ సిద్ధమైనది. రేపు ఒకసారి నీవు వస్తే ఆ కథ వినవచ్చు."

"ప్రొద్దుపోయినది. ఇక పోదాం" అంటూ ప్రసాదు, రామం గ్రామంవైపు నడిచారు. ఆ రోజు ఆ విధముగా గడిచినది. మరుసటిరోజుమాట ఎవరు చెప్పగలరు ?

ప్రసాదుకొరకు వాని తల్లి ఎదురు చూచుచున్నది. కుమారుడు స్నానంచేసి వచ్చే లోగా భోజనం సిద్ధపరచినది. వేడి అన్నమును ప్రియంగా తల్లిపోసిన మీగడ పెరుగుతో మిళితంచేసి భోజనం పూర్తిచేశాడు. ఏదో సంభాషణతో కొంత కాలహరణం జరిగినది. తర్వాత ఆ తల్లీకొడుకులు నిద్రాదేవి జోలపాటల లాలనకు లొంగిపోయిరి.

# 4

" అత్తయ్యా, అత్తయ్యా " అంటూ తలుపు తట్టిన చప్పుడయినది. ప్రసాదు లేచి " ఎవరు వారు ? " అంటూ తలుపు తెరిచాడు. ఎదురుగా ప్రభ. ఒకరిని చూచి మరి యొకరు క్షణకాలం నివ్వెరపోయిరి. " లోపలికిరా, ప్రభా. " అంటూ ప్రసాదు ఆప్యాయంగా పిలచాడు.

" అత్తయ్య లేదా ? "

" శాస్త్రిగారు పురాణం చెపుతున్నారట. అక్కడికి పోయినది. "

" నీవు ఒక్కడివే వున్నావన్నమాట. "

" అన్నమాట గాదు. వున్నవిషయం దాచకుండా చెప్పాను. "

" అత్తయ్య వుంటుందని ఆశతో వచ్చా. "

" అత్తయ్య లేకపోయినా నేనున్నానుగా. అతిథి సత్కారంచేయటం మరిచా. గదిలో కూర్చుందాము పద. " అంటూ ప్రసాదు ప్రభను తన గదిలోనికి తీసికొనిపోయి నాడు. ప్రభ బల్లమీద, ఎదురుగా ప్రసాదు మంచంమీద, కూర్చున్నారు.

" ప్రభా, ఈ రోజు ఏదో విశేషమున్నదే ? "

" కల్పించుకుంటే అన్నీ విశేషాలే. కాదనుకుంటే ఏమీ లేదు. ఈ దినం నా పుట్టినరోజు పండుగ."

" నీవు చెప్పకున్నా ఆ విషయం ముందుగా నాకు తెలుసు."

" ఈ విషయము మా యింట్లోవారికితప్ప మరెవ్వరికీ తెలియదే. ఎవరు చెప్పివుంటారు?"

" ఎవరితో నయినా చెప్పినావేమో. కొంచెం ఆలోచించు."

" ఊహూ, స్ఫురించటంలేదు. నీవే చెప్పాలి."

" బహుమానం ముందుగా చెప్పినకాని అసలు విషయం చెప్పను."

" అయితే ఈ పొట్లంలో కొంత నీకు."

" అది నా కొరకు తెచ్చిందేగా."

" ఆశకు అంతులేదండి. మొదట్లో మీకు ఇవ్వాలని లేదు. బహూకరించటం తప్పదుకాబట్టి మీకు కొంతభాగం యిస్తున్నా. ఇంతకూ ఎవరు చెప్పారేమిటి? దయచేసి త్వరగా బయటపెట్టండి."

" మా చెల్లెలు అన్నపూర్ణ చెప్పినది."

" అవును. నిన్న ఆమెతో చెప్పినట్లు జ్ఞాపకం."

“ ప్రభా, ఇంత మతిమరుపైతే ఎట్లా ? ”

“ ప్రసాద్, ప్రధానవిషయం కాకపోబట్టి అంతగా జ్ఞాపకంలోకి రాలేదు. ”

“ ఇక నా బహుమానం. నీకు ‘హిమబిందువు’ను బహూకరిస్తా. ”

“ హిమబిందువు అంటే మంచు కదూ. ”

“ ఏం, బహుమానం పనికిరాదా ? ”

“ అదికాదు. హిమబిందువంటే వివరించి విశదం చెయ్యమంటున్నా. ”

“ అడవి బాపిరాజుగారు ఒక చారిత్రిక నవలను సొంపుగా ఇంపైన పదజాలంతో రచించారు. కథావస్తువు హృదయాన్ని ఆకర్షిస్తుంది. అయితే చదవటానికి అదనంగా ఓపిక తెచ్చుకోవాలి. ”

“ హిమబిందువునుగూర్చి నే నడిగితే ‘బాపిరాజు’గారిని ఏకరువుపెట్టావు. ఏమైన పరాకులో నున్నావా ? ”

“ కాదు. బాపిరాజుగారు ఆవిధంగా వ్రాసిన చారిత్రక నవల ‘హిమబిందు’. అందులోని నాయిక హిమబిందువనే రాచకన్య. ”

“ తమరు ఇంతగా ఉపన్యసించినది పుస్తక బహూకరణకా ? ”

"ఇక, తమరుకూడా బయటపెట్టండి."

"నీకు ఏమికావాలంటే అది ఇస్తా. అయితే నా వద్ద ఉన్నదానినే కోరుకోవాలి."

"ప్రభా, అడిగిన తర్వాత కాదంటే బాగుండదు. ముందుగా కొంచెం యోచించి చెప్పు."

"ప్రసాద్, ఇందులో ఆలోచన ఏమున్నది ?"

"సరే, విను. ఒకసారి ఆ శ్వేత గులాబీ చెక్కిళ్ళను తనివితీరా చుంబించటమే నా కోరిక."

"ప్రసాద్, ఏమిటీ కొంటెకోరిక. పరిహాసాలు మాని నిజం చెప్పు."

"కావలసినదానిని అడిగాను. ఇవ్వటమా, మానటమా అనేది తమరి యిష్టం."

"ప్రసాద్, ఇరువురము ప్రేమించుకొన్నాం. ఆ ప్రేమ బహిరంగం కావటానికి పరిస్థితులు అనుకూలించాలి. పాశ్చాత్య విద్యా వ్యామోహంతో వారి వ్యవహారాలను అనుకరిస్తే మనకే నష్టం-మనకే కష్టం. ఒక్కొక్క దేశం వేషభాషలలో, ఆచారాలలో, జీవనంలో మరియొకదానితో భేదిస్తున్నది."

"ప్రభా, ప్రేమించినప్పుడు ఆశించటంలో తప్పేమున్నది ?"

" ప్రసాద్, విజ్ఞానవంతుడవు. అడిగి వానికి సమాధానం చెప్పి ఫలితాన్ని గమనించి గ్రహించు. "

"..................."

" మౌనం అంగీకార సూచనయా. "

" ఏదో ఒకటి. తమరు కానివ్వండి. "

" నీవు నన్ను ప్రేమించానన్నావు. నాలో ఏ అమూల్యాన్ని గమనించి నన్ను ఆరాధిస్తున్నావు ? "

" నీ మనోహర ఆకృతియే అందుకు మూలం. ఆ కండ్లలోని వెలుగు, ఆ అవయవముల లావణ్యం, ఆ కురుల సొంపు అన్నీ నన్ను ఆకర్షించినవి. "

" సౌందర్యాన్ని, సుకుమారతను నీవు ప్రేమిస్తున్నావు. ఆ ప్రేమలో కామంకూడా మిళితమైపోయినది. "

" అది మానవస్వభావం. అయస్కాంతం ఇనుమును ఆకర్షిస్తుంది. ఇనుము అయస్కాంతానికి దాసోహమంటుంది. ఇది ప్రకృతికి విరుద్ధం కాదుగా ? "

" ప్రసాద్, శీలాన్ని మించిన వస్తువు ప్రపంచంలో కానరాదు. ప్రేమ అని, వలపు అని, స్త్రీని నమ్మించి, ద్రోహంచేసిన మోసకారులు చాలామంది ఉన్నారు. మోసపోయిన మగువ జీవితములో వెన్నెలవెలుగులు దూరమౌతవి. స్త్రీపురుషులు ఆకర్షించుకోబడినపుడు వివాహం చేసికొనటం

ఉత్తమం. కాని ఆ ఆకర్షణ మెరుపులాగా వుండగూడదు వివాహం అయ్యేలోగా మగువ, మగవాడు తమ శీలాలను చక్కగా దిద్దుకోవాలి."

"ప్రభా, పర్యవసానం ఏమంటావు? నా ప్రణయ పుష్పము వాడిపోవలసినదేనా? నా ఆశారేఖ మాసిపోవలసినదేనా? నా వీణాతంతువు తెగిపోవలసినదేనా? ఇదియేనా నా లేఖకు నీ జవాబు."

"ప్రసాద్, బాధపడతావెందుకు? నేను నిన్ను ప్రేమించా. నాహృదయం నీకోసం ఎదురుచూస్తున్నది. కాని, వివాహంలోగా నాశీలాన్ని మలినపరచటం అంగీకరించను."

"అయితే, ఏమంటావు?"

"ఏమీలేదు. మానాన్నగారిని కలిసికొని వివాహపు ఏర్పాట్లు త్వరగా సాగించమని ప్రభువుగారికి మనవి చేసికొంటున్నా."

"దేవిగారి శెలవులయినపుడు ఆలస్యం జరుగదుగా."

"ప్రభువుగారూ, వెళ్ళుతున్నా."

"తిరిగి కలిసికొనే అవకాశం?"

"పిలుకలిగి అవసరమైనపుడు" అంటూ ప్రభ వెళ్లిపోయినది. గదిలో ప్రసాదు ఒక్కడే మిగిలాడు. వాని ప్రయత్నం సఫలమౌతుందని సంతోషపడుతున్నాడు. కష్టకాలంలో కన్నీటిబిందువులు, సంతోషసమయంలో సరస సల్లాపాలు సహజమేగా?"

# 5

"విజయా, రఘు నిద్ర లేచాడో, లేదో చూచిరా" అని రాజమ్మ, కూతురు విజయకు చెప్పినది. విజయ జవాబు చెప్పకుండా మానందాల్చినది. సిగ్గు తెరవ్రాలినది. "చూచిరా, తల్లీ! సిగ్గుపడతావెందుకు? వేణు కూడా లేచినట్లు లేదు." అని రాజమ్మ, కుమార్తెను మరొకసారి హెచ్చరించినది. తప్పనిసరి కావటంవల్ల విజయ వంటగదిలోనుండి మేడమీదికి పోయినది.

రఘు, వేణు ఇంకా నిద్ర లేవలేదు. రాత్రి ప్రొద్దు పోయేవరకు కబుర్లతో కాలంగడిపారుకాబట్టి బాలభానుని కిరణాలు కిటికీలో గుండా వారి శరీరములను స్పృశించి. మేల్కొనండని చెప్పినా వారు లేవలేదు. విజయ వారిని చూచినది. బల్లమీదనున్న గ్లాసులోని నీళ్ళను తీసికొని రఘు మీద పడేటట్లుచల్లి విజయ చాటుకుపోయినది. రఘులేచి కూర్చోగా ఎదురుగా నున్న అద్దంలో వాని బింబంతో మరి యొక బింబం గోచరించినది. వెనుకకు చూడగా విజయ మెట్లు దిగి క్రిందికి పోతున్నది. 'విజయా' అంటూ రఘు పిలవటం విజయకు వినపడలేదుకాబోలు. లేక వినపడికూడా సిగ్గుచేత శిరమువంచుకొని పోయినదేమో! ఈ పిలుపుకు వేణు మేల్కొనగా బావమరదులు కాలకృత్యనిర్వహణమై క్రిందికి దిగినారు.

రఘు క్రిందికి వచ్చేటప్పటికి మామగారైన మాధవరావు హాలులో కూర్చొని ఆంధ్రవారపత్రికను చదువుతున్నాడు. అప్రయత్నంగా మాధవరావు చూపులు ఆవైపు మరలటం, ఆ సమయంలో రఘును వారు చూడటం తటస్థించినది. రఘు కూడా అదేసమయంలో మామగారిని చూచాడు. "ఎప్పుడు వచ్చారండీ?" అంటూ మాధవరావుతో రఘు మాటలు ప్రారంభించాడు.

"రాత్రి మెయిలులో వచ్చా. ఇంటివద్ద అంతా కులాసాయేనా?"

"నాన్నగారు కులాసాగా వున్నారు. మా అమ్మ గారికి ఈ మధ్య సుస్తిజేసినది. ఇప్పుడిప్పుడే ఆమె కోలుకొం టున్నది. అన్నపూర్ణ ఆరోగ్యంగానే ఉన్నది."

"పాపం! అన్నపూర్ణవిషయం తలచుకొనినపుడు నాకు విచారం కలుగుతున్నది. మిసమిసలాడే నిండుజవ్వనంలో పతి ఎడబాటు కలగడం ఆమె జీవితంలో ఒక తుపానువీచటమే."

"నేను అదే ఆలోచిస్తున్నా. పునర్వివాహం చేద్దా మని యత్నిస్తున్నా. బహుశా నాన్నగారు నా కోరికకు, నా ప్రయత్నాలకు అడ్డుచెప్పరు."

"వివాహంచేయటం చాలాముఖ్యం. జీవితయాత్రలో తోడు లేనిది గమ్యం చేరుకొనటం దుర్ఘటం. నావికుడు ఉన్న ప్పుడే నావ సులభంగా ఆ దరి చేరుకొంటుంది."

"నా అభిప్రాయముకూడ అదేనండి."

"సరే. ఇప్పుడే నిద్ర లేచినట్లున్నావు."

"రాత్రి దీర్ఘచర్చతో ప్రొద్దుపోయేవరకు మునిగి పోయినాం. అందువల్లనే ఇంతవరకు మెలకువ రాలేదు" అంటూ రఘు కాలకృత్యములు నిర్వర్తించటానికి దొడ్లోకి పోయెను. ఆనాటి ఉదయం పరీక్షలు, విద్యావిధానము, మార్పుల అవసరము మొదలగువానిని గూర్చి ఆ మామ, అల్లుడు ప్రసంగించారు. అవసరమైనపుడు వేణు కూడా జోక్యం పుచ్చుకొనటం జరిగినది.

పండుగ మరునాడే కాబట్టి గృహానికి మెరుగులు దిద్దారు. గవాక్షములకు రంగులు, గోడలకు సున్నము, వాకిండ్లకు తోరణాలు నూతన సొబగును కల్పించినవి, ఇంటిలోని ఆడవారు గృహాలంకారములలోను, నూతన వస్త్రముల జాబితా తయారుచేయుటలోను, పిండివంటల నిర్ణయములోను మునిగిపోయిరి. మగవారు ఆడవారు కోరినవానిని తెచ్చుటలో కాలం గడిపిరి. పండుగ వచ్చినది. రఘు, వేణు తలంటి పోసి కొన్నారు. మామగారిచ్చిన నూతనవస్త్రములను రఘు అలంకరించాడు. నాటిదినం రఘులో ఓ వింత కాంతి తొంగి చూచినది. అది పండుగరాకకు సూచనయో, నూతనవస్త్ర ధారణ ఫలితమో! ఇక విజయ—బెనారసుచీరకట్టడానికి తగిన కంచుకం తొడిగినది. ఆరుతున్న కేశములను వదులు వదులుగా అల్లుకొని జడ వేసికొనినది. పరిమళసహితమై,

మనోరంజక మైన పుష్పసంతతిచే కూర్చినమాల ఆమె జడను అలంకరించినది. నుదుట కుంకుమరేఖ తీర్చినది. ఆ వాసనల ఘుమాయింపుతో ఆమె ఉత్సాహం క్రమంగా పెరిగినది. నాడు విజయలో రతీదేవిసౌందర్యం తొంగిచూచినది. హిందూ సతి లావణ్యం వెల్లివిరిసినది. ఆదర్శగృహిణీ స్వభావాలు ప్రస్ఫుటమైనవి. ఈ విధంగా ఆ గృహంలో పండుగరాక పరిమాణంలేని పరిణామాన్ని కల్పించి, తనచేతలకు తాను ముసి ముసి నవ్వులు నవ్వుకొన్నది. ఆ నవ్వులతో విజయ వీణను చేతబట్టి, తంతువులను సరిచేర్చి, రాగాలాపన ప్రారంభించినది.

బజారునుండి లోనికి వస్తున్న రఘు ఆ గీతం విని ఆగి పోయినాడు. తనకోమలి తీయని స్వరాన్ని విని పులకితుడై నాడు. తన మధురస్వప్నాలు ఫలప్రదమైనందుకు ఆనందిం చాడు. రఘు తన భాగస్వామిని ఎన్నుకొనుటలో కొన్ని నియమాలను నిర్ణయించుకొన్నాడు. ఆకర్షణీయమైన నేత్రాలు, సరియగు పోషణలోనున్న అవయవముల మృదుత్వం, మనస్సును రంజింపచేసే గానకళ, ఆదర్శ గృహిణీ మణికి అవసరమైన శుభసూచకములు—ఇవన్నీ కలసి ఒకమూర్తిని ఏర్పరచటం. ఆ మూర్తి విజయ కావటం విజయను రఘు చేపట్టటం జరిగిపోయిన పలుకులు. గతించిన చరిత్రలోని మధురఘట్టాలు భావిదాంపత్య జీవితానికి నాందీ వచనాలు.

భోజనాలు అయినవి. విశ్రాంతి తీసికోటానికి రఘు మేడమీద గదిలోనికి పోయినాడు. ఆగదిలో ఒక వైపు భారతజాతి చరిత్రకు జీవముపోసిన మహాపురుషుల చిత్రములు, కవికుమారుల రూపములు అలంకరింపబడినవి. వాటికి ఎదురుగా రెండవవైపు ఒక నిలువుటద్దము అమర్చబడినది. గదిలో ఒకమూల కిటికీకి సమీపమున వున్న మంచముపై రఘు శయనించెను. ఏదిరో ఆలోచించుచు కిటికీ వైపు చూచుచుండుటచే విజయవచ్చినది గమనించలేదు. విజయ తమలపాకులపళ్ళెమును రఘు శయనించిన పాన్పునకు చేరనున్న టేబిల్‌పై పెట్టుటలో సద్దు అయినది. రఘు ఆలోచనకు ఈ నాదము ఆటంకము కలిగించినది. వెనుదిరిగి చూడగా సౌందర్యనిధి విజయ గన్పించినది. అవకాశము జారవిడువక విజయకేలును గ్రహించి నునుపాటి ఆ లేత గులాబి చెక్కిళ్ళను రఘు చుంబించగా విజయ సిగ్గుచెంది దూరముగా పోయినది. రఘుశయ్యనుండి లేచి 'విజయా' అంటూ ముమ్మారు పిలిచినా విజయ సిగ్గుచేత వాల్చిన శిరమును ఎత్తలేదు. రఘు విజయను చేరదీసి ఏమేమో చెప్పినాడు. సుధలొలుకు ఆలలన పలుకులను వినుటకై అతడు చేసిన యత్నములు విఫలమైనవి. ఐనను వానిలోని ఆశారేఖ అదృశ్యము కాలేదు. మరియొకసారి ఆమె కపోలమును ముద్దిడి కౌగిలిలోనికి తీసికొనినాడు. విజయ అబ్బా అని కౌగిలి విడిపించుకొన ప్రయత్నించినది. రఘు విజయను విడిచిపెట్టగా ఆమె దూరముగా తొలగి కాలితో నేలరా

యుచు నిలుచున్నది. "విజయా, అనురాగామృతాన్ని ఆశించ వస్తే ఆ ఆశ నిరాశ చెయ్యటం ఉచితమేనా? మధురస్వప్నాలను యదార్థరూపంలోకి తేవాలని ప్రయత్నించేటప్పుడు అడ్డు నిల్వటంలో నీ ఉద్దేశ్యం ?" విజయమౌనంగా ఉండినది. ఇంతలో 'విజయా' అంటూ క్రింద ఎవ్వరో పిలిచిన శబ్దం వినిపించినది. "విజయా, మళ్ళీ కలిసికొని మాట్లాడే అవకాశం ఎప్పుడో," అన్న రఘు నుడువులకు జవాబుగా "అవకాశమున్నప్పుడు" అంటూ విజయ క్రిందికి పోయినది నాడు శృంగారములోని తొలి అంకము ముగిసినది.

మరునాటి సాయంత్రం మిద్దెమీద రఘు తిరుగుచున్నాడు, ఆకాశరంగస్థలంలో వెన్నెల తెరవ్రాలినది. మలయమారుతము వీచుచున్నది. తోటనుండి సెంటుజాజి మనోరంజనుల ఘుమఘుమలు మెట్లుఎక్కి మేడపైకి వచ్చినవి. వచ్చిన అతిథిని ఆదరించి రఘు ఆనందిస్తున్నాడు. గత దినం గదిలో జరిగిన విషయాలు ఒకదానివెంట మరియొకటి రఘుమనో వీధిలో మెరిసిపోతున్నవి.

" ముందు తాను త్వరపడెనా ? అధరచుంబనముచే విజయ భయపడెనా ? వివాహమైనతర్వాత కులాసాగా కూర్చొని కూనిరాగాలుతీయని లోపమేమో ? అయినా ఆ అవకాశం అందరికీ లభిస్తుందా ? బహుశా విజయ సిగ్గుపడి ఉండవచ్చు. అబలలకు సిగ్గు అనేది సహజం. అందులో తాను క్రొత్త. పైగా చేయుబోయేది సృష్టికార్యం. ఆనందించ

బోయేది రతికేళీ రమ్యత్వం. సమయం ఏకాంతమైనా ఎవ రైనా పరిహాసం చేస్తారేమోనని వెనుకాడి యుండునేమో ? బహుశా అదికూడా ఒక కారణం కావచ్చు." ఈవిధంగా రఘు ఆలోచించాడు. ఆలోచన ఒక గమ్యంచేరుకొన్నట్లు కానరాదు.

చంద్రకిరణాలకాంతి ఇనుమడిస్తున్నది. రఘు అచటనే కూర్చున్నాడు. ఇంతలో అడుగులచప్పుడు. ఎవరాలని రఘు అనుకొనుచుండగా విజయ పైకివచ్చినది. విజయకు కన్పించ కుండా రఘు ఒదిగికూర్చున్నాడు. విజయకు మేడమీద పతి ఉన్నాడని తెలియదేమో ? తెలిసివుంటే బహుశా రాకపో వచ్చు. ఏది ఎట్లాగైనా గతదినం జరిగిన శృంగారఘట్టంలోని తొలిదృశ్యం ఆమె హృదయాన్ని కలవరపరచి వుంటుందనేది విజ్ఞానవంతులకు, అనుభవపరులకు నూతనవిషయం కాదు. విజయ మేడమీదకు వచ్చి తోటలోనికి తొంగిచూస్తున్నది. రఘు సద్దుచేయకుండా కండ్లుమూయుటం, విజయ కలవర పడటం, రఘు చేతులుతీయటం వెంటవెంట జరిగిపోయినవి.

"విజయా! కూర్చో. శెలవుదినాలు నీతో కులాసాగా గడుపుదామని వస్తే నీవు ఘోషాస్త్రీ వలె కంటికి కనుపడ కున్నావు. కలిసికొనటంజరిగినా నన్నుచూచి నీవు తొలగిపో వటం జరుగుచున్నది. ఈ రోజైనా కొంతసేపు మాట్లాడు కొందాము. ఏమంటావు ? "

విజయ మౌనంగా వింటున్నది.

" విజయా! ఆకాశంలోని వెన్నెల ఎంత మనోజ్ఞంగా వున్నదో చూడు. ఆ చంద్రకిరణాలు వృక్షులలోని వుత్సాహాన్ని రెట్టింపు చేస్తున్నవనటం సందేహం కాదుగా. మన తోటలో చూడు పూలచెట్లు ఎంతగా ప్రకాశిస్తున్నవో! " అంటూ విజయను రఘు లేవదీశాడు. తోటలోని కొలకపారి తొంగిచూశారు. పూల పరిమళం వారికి మత్తుగలిగించినది.

" విజయా! మేము తొలిచూపులకు వచ్చినపుడు నీవు వీణ మీటుచూ పాడిన పాట నా హృదయమును ఉత్తూతలూపినది. ఆ శేత్రవేళ్లు కందిపోవునేమోయని తోచినది. మన వివాహంనాటి విషయాలు గుర్తున్నవా ? నేను తరలిరాగానే ఎప్పుడెప్పుడు నిన్ను చూద్దామా అని మనసులో నొక వాంఛ మొలకెత్తినది. అయినా ఆ కోరిక నెరవేరటానికి కొంత వ్యవధి అవసరమనేది ఆ ఉద్రేకములో స్ఫురణకు రాదులే. అవి అమూల్యదినాలు—మధురఘట్టాలు. "

" నాకుగూడా మీరు వెళ్లినప్పటినుండి మనసులో ఏవో వ్యక్తంచేయలేని భావాలు బయలుదేరినవి. మీలోని ఒక పటుతర శక్తి నన్ను ఆకర్షించి మీకు దాసోహమన్పించినది. "

" విజయా ! నీవు చెప్పినది సత్యసమ్మతమే. ఎదురుకోలలో నీవు పూలహారంవేయటం, నేను తిరిగి నీ మెడలో పుష్పమాలను అలంకరించటం తలచుకొంటే సంతోషం కలుగుతున్నది. ఇన్నాళ్ళనుండి ఆ తలపులతోనే కాలంగడిపి

ఈ రోజుకు ఎదురుచూచా. తొలిచూపులనుండి వివాహా నంతరంవరకు జరిగినవానినిగూర్చి ఒక పాత్రాన్ని రచించా. ఎప్పుడైనా వివాహంనాటి దినాలను స్మరించుకోటానికి ఆ పాత్రం చాలా సహకారం కల్గిస్తుంది."

విజయ వింటున్నది. పూలపరిమళము మత్తు కలిగించినది. విజయ ఆశాపూరిత నేత్రాలతో చూడగా రఘు ఆమెను కౌగిలిలోనికి తీసికొన్నాడు. వెంటనే ఆ ఎఱ్ఱని పెదవులు కలిసికొన్నై. సతీపతుల సరసాలమధ్య తానెందుకని చంద్రుడు మబ్బుచాటుకు పోయినాడు.

మరునాడు మామగారిచ్చిన కానుకలతో రఘు స్వస్థానము చేరుకొన్నాడు.

# 6

ఉదయం తొమ్మిది గంటలయినది. ప్రసాదు గదిలో కూర్చుని ఏదో పుస్తకము చదువుచున్నాడు. చదువుచున్న ప్రసాదుకు ఆటంకంగా వాని తల్లి లోనికివచ్చినది. తల్లి రావటం ప్రసాదు గమనించాడు.

"ఏమిరా, అబ్బాయి ఎప్పుడూ చదువేనా? విశ్రాంతి లేకుండా చదువుచుంటే జబ్బు చేస్తుందినాయనా."

"కాదమ్మా, ఏమీతోచక ఇప్పుడే పుస్తకం తెరిచా. ఈ రోజు రామంకూడా ఊళ్ళోలేడు. ఉన్నట్లయితే ఏదో విధంగా కాలం గడపటానికి వీలు కల్గేది."

"ఇవన్నీ అట్లావుంచు. మరి ఇన్నాళ్ళనుండి నేను చెప్పేమాటను ఏంచేశావు?"

"ఏమిటమ్మా, ఆమాట."

"నీ వివాహవిషయమే. నీవు, కోడలు కలిసి కులాసాగా నవ్వులతో, సంతోషంతో, ఉత్సాహంతో ఇంట్లో తిరుగుతుంటే చూడాలనేదే నాకోరిక. అయినా అంతకన్న కావలసినదేమున్నది? నేను ఎంతగా ఆశపడి త్వరపడు చున్నానో అంతగా నాకోరిక వెనుకకు పోవుచున్నది."

"నీకోరిక త్వరలో నెరవేరే సూచనలున్నవమ్మా"

"ఎన్నాళ్ళ కీమాట విన్నాను నాయనా మరి. పిల్ల ఎవరు?"

"ఒక చక్కని చుక్క. అందాలకుప్ప. సద్గుణనిధి. మనఊరేనమ్మా."

"ఎవరు నాయనా?"

"ప్రభావతి—రామయ్యగారి కూతురు"

"మన ప్రభావతేనా? ఇన్నాళ్ళనుండి పెరటిలో కల్పవృక్షాన్ని పెట్టుకొని కండ్లు మూసికొన్నా. ఈడు, జోడు సరిపోతుంది. నీ ఆదర్శాలకు నచ్చినదా?"

"నాకు బాగా నచ్చినదమ్మా"

"ఇంక ఆలస్యం దేనికి? నేనువెళ్ళి రామయ్యగారితో ఈ విషయం ముచ్చటిస్తా. ముందుగా రమణయ్య ద్వారా వారి అభిప్రాయాలు కనుక్కుంటా" నంటూ ప్రసాదును ఏకాంతంగా వదలి వానితల్లి లోనికి పోయినది. ప్రసాదు పుస్తకం మూసి ఆలోచిస్తాడు.

"వివాహం అనేది జీవితంలో గొప్పమార్పు తెస్తుంది. ఆలోచించకుండా ఆకర్షణకు లోనైతే జీవితాంతంవరకు విచారించవలసివస్తుంది. ఎన్నో విషయాలు ఆలోచించుకోవాలి. పరస్పర అభిరుచులు, సౌందర్యం, కళాసేవ, విజ్ఞానము వగైరాలలో ముఖ్యంగా జాగ్రత్త తీసికోవాలి. ఏదో విధంగా అనుకూలవాతావరణములో వివాహం ముగుస్తుంది. స్వయంకృషి, స్వాతంత్రసంపాదన లేకుంటే ఆ ఉభయుల జీవితములో, వారి దాంపత్యంలో సుధాస్రవంతి ప్రవహించదు.

ఆనందం అగోచరమగుతుంది. సంపాదన లేకుండా వివాహం చేసికొనటం విధ్యుక్తధర్మం తెలిసికొన్న వానిని వేధిస్తుంది. ఈ దరిద్ర పరిసరాలలో, ఈ నిరుద్యోగ కాటకంలో, తృప్తితీర తినుటకు తిండి లేని ఈ పరిస్థితులలో వివాహంచేసికొని తద్వారా తమ సంతానానికి తమ కష్టాలు, తమ విచారాలను 'ఇదే మేము మీకు సంపాదించి దాచిన ఆస్తి అంటూ' ఒప్పజెప్పటంకన్నా హేయం లేదు. భావిసంతానానికై చక్కగ రాజబాటను చుట్టూ పరిమళసహితవికసితకుసుమ వాటికతో నిర్మించటానికి పునాది వేయాలి. పునాదిప్రకారం నిర్మాణలోపం లేకుండా జరిగినప్పుడే దాంపత్యజీవితంలోని సమస్య తేలుతుంది."

ఆలోచించటం ముగిసినది. "ఎట్లాగైనా ప్రభను వివాహం చేసికొనటం ముఖ్యం. అటుపై ఉదరపోషణానికి మెదడు ఉపయోగించి స్వయంకృషిచే ఆర్జించటం కర్తవ్యం. తద్వారా అనురాగదాంపత్యానికి మెరుగులుదిద్దటం గమ్యం" అంటూ ప్రసాదు ఆలోచనాఫలితంగా ఒక కార్యక్రమాన్ని నిర్ణయించుకొన్నాడు. ఈ కల్పనాశిల్పం యథార్థజీవితంలో ఎంతవరకు ఆచరింపబడుతుందో ప్రకృతే తేల్చి చెప్పాలి.

# 7

చూడటానికి ఆయిల్లు చాలా ఆకర్షణీయంగా ఉన్నది. భానుకిరణాలకు, వాయువురాశకు ఆయింటి కిటికీలు స్వాగత మివ్వటం సహజమై పోయినది. వితంతువుగా జీవితం గడుపుచూ తల్లిదండ్రుల సంరక్షణలో నున్న అన్నపూర్ణ ఆ ఇంట్లోనే ఉంటున్నది. అది ఆమె తండ్రికి పిత్రార్జితం. వారిది ఒకప్పుడు గొప్ప కుటుంబం. కాని కాలగతి వారి పరిస్థితిని తారుమారు చేసినది. అందువల్ల వారిని సామాన్యకుటుంబీకు లనటం సమంజసం అనుకొంటా.

అన్నపూర్ణ తల్లికి వంటపనిలో సహాయంచేస్తూ ఉన్నది. కూరగాయలను తరుగుతూ "అమ్మా, పండుగకు అన్నయ్య రాలేదేం ?" అన్నది అన్నపూర్ణ.

"అన్నయ్య పండుగకు అత్తగారింటికి పోయినాడు."

"అన్నయ్య విజయను చూడటానికి వెళ్ళాడా ? సరే గాని, నేను విజయనుచూచి చాలారోజులైనదమ్మా."

"ఎక్కడరోజులమ్మా. రఘు వివాహంఅయి ఇంచు మించు సంవత్సరం మించిపోయినది. నీవు అప్పుడేగా విజ యను చూచినది."

"అవునమ్మా. మేజువాణిసమయంలో వదినె పాడిన పాట అప్పుడప్పుడు స్ఫురిస్తున్నది. పాటతో వదినెకూడా స్మృతిలోనికి వస్తున్నది. వదిన బాగా పాడుతుందిగదమ్మా."

" రఘు విజయను సతిగా స్వీకరించటానికి మూలం అదేగా. మనవాడు గానకళాప్రియుడు. ఆమె వీణాధారి యగు వాణీదేవి. చేయికదిపి, తంతువులను కంపింపచేసినదా ప్రతివాడు ముగ్ధుడు కావలసినదే. ఆ కంఠస్వర మాధుర్యా నికి దాసోహ మనవలసినదే."

" నిజంగా అన్నయ్య అదృష్టవంతుడు. తగిన సతి లభించినప్పుడు మగవాడికి కావలసిన దేమున్నదమ్మా?"

" అవునుగాని సౌందర్యవతి, సుగుణవతియైన సతి లభించినంతమాత్రాన గృహంలో శాంతిజ్యోతి వెలుగదు. అనురాగరేఖలు వ్యాపించవు. వారి అభిప్రాయాలు పరస్పరం సమ్మేళనం చెందినప్పుడే ఆ దాంపత్యం ఆనందదాయక మగు తుంది. అప్పుడు వారి హృదయాలు సూర్యకిరణాలచే విచ్చిన పద్మసమూహంవలె వికసిస్తవి."

" దాంపత్యమాధుర్యానికి సతీపతుల అభిప్రాయాలు, అభిరుచులు ఏకీకరణం కావాలా?"

" ఒకరిమాటకు మరియొకరు ఎదురుచెప్పటం, పట్టు దలతో ఒకరు మూకీభావం వహించటం, నిత్యకలహాలు ఈ విధంగా ఎందరు దంపతులు ఒకరికొకరు దూరమాటంలేదు. చదువుకొని, మర్యాద తెలిసినవారిని చేపట్టినా ఈ సమస్య అంకురించకమానదు. అనురాగపూరితహృదయాలతో ఒకరి మాటను మరొకరు సమయోచితంగా ఔదల దాల్చాలి.

అప్పుడుగాని ఈ సమస్యాపరిష్కారం జరుగదు. అంతవరకూ ఈ బండి రాళ్ళురప్పలపైన నడవవలసినదే!"

"అనుకూల దాంపత్యం ఇంతగా అరుదైనపుడు అన్నయ్య జీవితసాగరంలో తుపానులేపి స్తవ్వా? ప్రశాంతతే ఆవరిస్తుందో? వారి దాంపత్యంలో పూర్ణ సుధాకరుని మనోహరత్వమే గోచరిస్తుందో? లేక అయోమయ అంధకారమే ఆవరిస్తుందో? ఎవరు చెప్పగలరు? ఎవరు చెప్పినా అది కల్పనేగా?"

"అన్నయ్యనుగూర్చి నీవు ఇంతగా ఆలోచించాలా. మీ జీవితం ఇతరులకు ఆదర్శప్రాయం. అట్లాగే అన్నయ్య జీవితం కూడా. కరుణాపూరితుడైన ఆ భగవానుని చల్లని చూపులు వారిపైకి ప్రాలకపోవు."

తల్లి తమ దాంపత్యాన్ని గూర్చి పలుకగానే అన్నపూర్ణ మనోవీధిలో చనిపోయిన భర్త గోచరించటం, ఫలితంగా కన్నీటిబిందువులు రాలటం జరిగినది. ఇంతలో తల్లి అన్న పూర్ణను చూచి "ఊరుకోవమ్మా. తెలిసినదానివి నీవూ దుఃఖిస్తే ఎట్లా. అది ఒక మెరుపు" అంటూ ఓదార్చినది. ఆమె ప్రేమపూరిత వచనాలతో, ఓదార్పుతో అన్నపూర్ణ ఉద్రేకం అణిగిపోయినది. ఆమె బాష్పబిందువులు ఆరిపోయినవి. తర్వాత ఆ తల్లి కూతురు వారి వారి పనులలో లీనమైనారు.

మధ్యాహ్నభోజనాలు ముగిసినవి. అన్నపూర్ణ తన గదిలోనికిపోయి ఉబుసుపోకకు ప్రసాదువద్ద తెచ్చిన పుస్తకం

చదువుదామని తెరచినది. అందులో మొదటిపేజీపై వ్రాసిన 'మనోహారి—ప్రభ' అనునది చూచినది. వెంటనే మనసులో తలపులు బయలుదేరినవి.

"ఆ రోజు తలంటి పోసికొని ప్రసాదుకొరకు తాను వారింటికి వెళ్ళటం, ప్రసాదు గదిలో తాను ఆ పుస్తకం తీసికొనటం, ఆ మాటలను చూడటం, అటుపై అంతిమ నిర్ణయం చేయకుండుట" ఆమెకు జ్ఞాపకమునకు వచ్చినవి.

"ప్రభ అంటే నా నెచ్చెలి ప్రభావతియేనా? ప్రసాదుకు ప్రభకు సంబంధం లేనప్పుడు ప్రసాదు ఎందుకువ్రాస్తాడు? బహుశా వారికేదో సంబంధం వుండవచ్చు. ఆరోజు నాకోసం ప్రభావతి ప్రసాదుఇంటికి వచ్చి, దొడ్డిలోనికి వచ్చినపుడు వారిరువురిమధ్య చూపులఅధ్యాయం ముగిసినది. అది ప్రథమాధ్యాయమో? లేక ఇంకేమో? అయినా ప్రభావతి అవివాహిత. ప్రసాదుకూడా ఆ తరగతిలోనివాడే. ఒకవేళ వారిరువురు ప్రేమించుకొన్నారేమో! ఈడు జోడు సరిపోతుంది. రూపురేఖలు సమానతూకంలో నున్నవి. ఈ ప్రణయ వ్యాపారంలో ప్రథమంలో జాగ్రత్త తీసికోవాలి. భావిని యోచించటం ఉత్తమం. ప్రభకు ఒక హెచ్చరిక నివ్వాలి. ఒకవేళ నేను త్వరపడుచున్నానేమో! ప్రభ అంటే నానెచ్చెలి కాదేమో. తెలియక అంటే వృధాగా ప్రభ మనసు నొప్పించినదాని నగుదును. అయితే ప్రసాదును అడిగితే ప్రయోజనం ఉన్నదా అనేది ఒక సమస్య. అయినా ప్రసాదు స్వార్థ

ప్రియుడై కామినీహృదయాలను కలుషం చేసేవాఁడు కాదే. వానివదనంలో ఎప్పుడు శాంతము, ఔన్నత్యం గోచరిస్తవి. శీలంలో జాగ్రత్తతీసికొనటం వానికి క్రొత్తకాదు. ప్రభ ఈమె కాదేమో. ప్రసాదుకు బంధువేమో." ఈ విధంగా అన్నపూర్ణ ఆలోచించినది. 'ఒకసారి ప్రభను ఈ విషయం అడగటం సందేహనివృత్తికి ఒకసోపానం. సందేహనివృత్తితో కాని సర్వం చక్కబడవు' అని నిశ్చయించుకొని మంచం మీాద పడుకొని నిద్రపోయినది. ... ... ...

బహుశా సాయంత్రం నాలుగు గంటలు కావచ్చు. అన్నపూర్ణ రాట్నంత్రిప్పుతూ నూలు వడుకుచున్నది. ఇంత లోనే ప్రభావతి అచటికి వచ్చినది. త్రిప్పుతున్న రాటం ఆగిపోయినది. నిశ్శబ్దత నిర్విచారంగా నిష్క్రమించినది.

" అన్నపూర్ణా! నూలు వడకటం నేర్చుకొంటున్నావా ?"

" ప్రభా, నేర్చుకొనటంకాదు. అందులో నిపుణత్వం కూడా సంపాదించా. అయినా విరామకాలం వ్యర్థభాషణతో గడిపేదానికన్నా లాభయుక్తమైనకృషితో గడపటం ఉచితం. పైగా కుటుంబనిర్వహణకు కొద్దిపాటి సహకారం కూడా కలిగిస్తుంది. జీవితంలో విరామకాలం పెరిగేకొలది వ్యక్తిలో సోమరితనం వికసిస్తుంది—స్వయంకృషి తరుగుతుంది. మానవ జీవిత సౌభాగ్యానికి కృషి ఉత్తమం. ఆ కృషిలో మరణించినా అది విచారమైనది కాదు. కన్నీటికణాలు రాల్చవలసిన

కాలంకాదు. వాని కృషి ఫలవంతంకాకముందే మరణించినం దుకు ఆవేదన చెందాలి."

"నేను ఏదో అడిగితే నీవు గొప్పగా ఉపన్యసించావే. నీవు చెప్పినందుకుగాను నేను అడగటం అవశ్యం కర్తవ్యం. వ్యక్తి నిరంతరము కృషిలోనే మునిగిపోతే వాని జీవితంలో విశ్రాంతి ఎప్పుడు? వినోదం ఎప్పుడు?"

ప్రభా, ఓపినకొలది కృషిచెయ్యటం అవసరమన్నానే కాని విశ్రాంతి అనవసరం అనలేదే. శ్రాంతిచెందిన వ్యక్తి స్వయంగా విశ్రాంతి తీసికొంటాడు. ఒకవిషయంలో కృషి చేసేటప్పుడు దానియందు నమ్మకం వుండాలి. నమ్మకంతో జరిగే ప్రతి కార్యంలోను ఆరోహణ, అనందాన్ని, వినో దాన్ని కలిగిస్తుంది."

"ఇంతకూ తేలిన సారం ఇది. ఏదో లాభానికి నీవు ఈ చక్రాన్ని త్రిప్పుచున్నావు. పైగా అది వుచితమని కర్తవ్యమని అంటున్నావు. అంతేగా?"

"మాటలలో బడి మరిచిపోయినాను కూర్చో. విశేషాలేం?"

"అన్నపూర్ణా, రేపు మా పుష్పవాటికలో వన భోజనాలు, పుష్పసేకరణ జరగబోతున్నది. నిన్ను ఆహ్వా నించటానికి స్వయంగా వచ్చాను. ఎదురింటి లక్ష్మి, ప్రక్క యింటి రాజ్యం, మేష్టరుగారి భార్య ఇందిరాదేవిగారుకూడా

వస్తారు. నీవూవ స్తే బాగుంటుంది. సంతోషసోపానం ఎక్కవచ్చు. ప్రకృతిసౌందర్యాన్ని, పుష్పసౌరభాన్ని, నిర్మలోదకాన్ని వీక్షించవచ్చు. ఆ అవలోకనంతో తీయతీయనిభావాలు ఉత్పన్నం కావచ్చు. మధురభావ విజృంభణతో ఆనందం కలుగుతుంది—ఉత్సాహం ఇనుమడిస్తుంది."

"మాతృశ్రీ, పూజ్యశ్రీగార్లు కూడా వస్తారా?"

"నాన్నగారు వూళ్లో లేరు. మా అమ్మ మాత్రం తప్పక వస్తుంది."

"రావటానికి నాకు వుత్సాహంగానేవున్నది. పురుషులెవ్వరు రారుగా?"

"ఈ వనవిహారానికి వనితలనే ఆహ్వానించాను. రేపు వుదయంనుండి సాయంత్రం వరకు మనము తోటలో కులాసాగా కాలంగడిపి భాస్కరుని అదృశ్యంతో గ్రామంలో దృశ్యం కావాలి."

"అయితే అమ్మ నడిగి వస్తా" అంటూ అన్నపూర్ణ లేచి లోనికిపోయినది. ప్రభకూడా వెంబడిస్తుంది.

"ఏంతల్లీ, వచ్చావు. ఏకులయిపోయినవా? ఓహో ప్రభవచ్చినదే!" అని అన్నపూర్ణతల్లి అంటుంది. "అమ్మా ప్రభావతీ లక్ష్మి వనభోజనాలకు వెళ్ళుచున్నారు. ప్రభ నన్ను రమ్మంటున్నది. నీవు ఏమంటావో అని అడగ వచ్చా." అంటుంది అన్నపూర్ణ. "నీ కిష్టమైతే

వెళ్ళిరా దీనికి అడగవలెనా." "పిన్నిగారూ, మీరూరండి" అంటుంది ప్రభావతి. "తీరికలేదమ్మా, మీరందరు వెళ్ళిరండి. మేముకూడా మీనాయస్సులో ఇట్లానే గడిపాము." అంటుంది అన్నపూర్ణతల్లి. ఉత్సాహంతో నాలుగు పాదాలు గదిని చేరుకొంటవి. తిరిగి యదా స్థానములో వారు కూర్చుంటారు. అన్నపూర్ణ మనసులో ఏదో స్ఫురించి మంచం వద్దకు పోతుంది.

"అన్నపూర్ణా, ఏమిటి ఆలోచిస్తున్నావు? చిత్తం పరాయత్తం అయినదా?"

"ప్రభా. చిత్తం విడివడని సమస్యచే చీకాకు పడుచున్నది. నీవు సాయంచేస్తే సమస్యా పరిష్కారం సులువు అవుతుంది." అంటూ అన్నపూర్ణ మంచంమీద కూర్చుంటుంది.

ప్రభ అన్నపూర్ణతో పాటు అక్కడనే కూర్చొని త్వరగాచెప్పు. సహకారంతోగాని సమస్యలు చక్కబడవు." అంటూ బలవంతం చేసినది.

"ప్రభా, అడగమంటావా? మనసుకు నొప్పి కలుగుతుందేమో?"

"అన్నపూర్ణా, అనుమానం ప్రాణసంకటమంటూ అనుభవనీయులు వచించారు. తెలియక బాధపడేదానికన్నా తెలిసికొనడం ఉత్తమ లక్షణం. విషయం వెళ్ళబెడితే తర్వాత జరిగే కార్యకలాపాలు అడ్డులేకుండా జరుగుతవి."

అడగటమా మానటమా అని ఏదో ఒకటి నిర్ణయించుకొనలేక పోయింది అన్నపూర్ణ. చెదరిపోయిన ధైర్యాన్ని కూడగట్టుకొన్నది. ఉత్సాహంతో, ఉద్రేకంతో అలమర తెరచినది. లోనున్న పుస్తకాన్ని తీసికొని పుట త్రిప్పి ప్రభను చూడమనినది. ప్రభావతి చూపులు వ్రాలినవి. 'మనోహరి—ప్రభ." ఆ అక్షరాలు ప్రభలో ఏమార్పును కలుగజేయకుండుట అన్నపూర్ణ గమనించినది.

" అన్నపూర్ణా, ఈ పుస్తకంఎవరిది? దీనిమీద నా పేరు వ్రాసివున్నదేం? అయినా నీకెట్లా వచ్చినది?

" వివరాలు చెప్తా విను. ఒకనాడు నేను తలంటి పోసుకొని మా అన్నయ్య ప్రసాదుగారింటికి పోయినాను. అతనిగదిలో ఈ పుస్తకంచూచి తీసికొన్నా. నేను వెళ్ళినప్పుడు ప్రసాదు దొడ్డిలో పూలమొక్కలకు నీళ్లు పోస్తూ వుండటంవల్ల నేను అచ్చటికి వెళ్ళి, వాని అనుమతిపై చదువవలెనని కుతూహలంతో ఈ పుస్తకాన్ని తెచ్చాను. ఆరోజు అచటికి నీవుకూడా వచ్చావు. నేను అప్పుడే ఈవ్రాతను చూచాను. తరువాత అడుగుదామనుకొనడం, మరిచిపోవటం జరిగినది. ఇంతకు ఈ నిగూఢరహస్యాల్ని నీవు విప్పిచెప్పాలి."

" అన్నపూర్ణా, నీవు చెప్పటం పూర్తిఅయినదా? మరి కావలసిన విషయం?"

"నీపేరు పుస్తకంపై వ్రాయటం ఎట్లా జరిగినదా అనేది సమస్య. పైగా ప్రసాదు ఎందుకు వ్రాశాడా అనేది

మరియొకటి. మీ యిద్దరికి ఏమిసంబంధమూ అనేది మూడవది. ”

ఈ మాటలు వినిన ప్రభ సిగ్గుతో శిరము వంచినది. అన్నపూర్ణ చెప్పినదాక వూరుకోనలేదు. చివరకు బలవంతం మీద “ అన్నపూర్ణా, నేను ప్రసాదు పరస్పరం ఆకర్షించు కొన్నాము. మా నాన్నగారి అనుమతికి మా వివాహం ఎదురుచూస్తున్నది. వారి అనుకూల అభిప్రాయంతో ఆ ముచ్చట తీరుతుంది — గురుతర బాధ్యత మానెత్తిన పడుతుంది. పరస్పర అభిప్రాయ ఏకీకరణతో దాంపత్య నావను ఒడిదుడుకులు లేకుండా నడపటమే ఆ బాధ్యత. తన అనురాగం సఫలమాతుందనే భావనతో ప్రసాదు ఆ విధంగా వ్రాసివుండవచ్చు.” అంటూ అన్నపూర్ణసందేహాన్ని తొలగిస్తుంది ప్రభావతి. “సమస్యాపరిష్కారం ముగిసినదా? అనుమానం తీరినదా? విషయాలు అర్థమైనవా?” అంటూ ప్రభావతి అడిగినదానికి అన్నపూర్ణ తల ఊపుతుంది. ‘మరిచిపోవాక. నీవు తప్పక రావాలి’ అంటూ ప్రభావతి వెళ్ళిపోయినది. ఈవిధంగా ఒకనాడు ప్రపంచపుస్తకంలో కొన్ని పుటలు నిండుతవి.

# 8

తూర్పుదిశన ఎవ్వరో కాగడా వెలిగించినట్లున్నది. ఆ కాగడా వెలుగు బ్రహ్మాండాన్ని ఆవరిస్తున్నది. వెలుగు అంతకంతకు హెచ్చుచున్నది. అంధకారము అంతకంతకు అదృశ్యమౌచున్నది. నిద్రాముద్రిత ప్రజాకోటిలో చైతన్యం పెరుగుచున్నది. గడియారములోని గంటల ముల్లు ఎనిమిది చూపినది.

ప్రభావతి అప్పుడే కుంకుమరేఖ దిద్దుకొంటున్నది. కురులు చక్కగా దువ్వుకొనినది. బహుశా నాడు ప్రభావతి గతదిననిర్ణయం ప్రకారం వనభోజనానికి సిద్ధపడుచున్నదేమో? ఇంతలో ఒక యువతి అలంకారముతో అచటకు వచ్చినది. "లక్ష్మి, అంతా సిద్ధంచేశావా?" "ప్రభా, నేను సిద్ధంగానే ఉన్నా. రాజ్యం, ఇందిరాదేవిగారలకు త్వరగా తెమల్చండని ఘట్టి హెచ్చరిక నిచ్చి ఇటు వచ్చాను." "నా అలస్యం ఏమీ లేదు. వనభోజనానికి కావలసిన సామాగ్రిని బండికి ఎక్కించాను. సందు మలుపులోనున్న వెంకాయమ్మ గారు శాకపాకములు తయారుచేయుటలో నిపుణురాలని వినికిడి. మనకు సాయంచేయవలసినదని ఆమెను ప్రార్థించా. చివరకు ఆమె తలయూపి సరే నన్నది. అన్నపూర్ణ ఎంతలో నున్నదో కనుక్కుందాం పద" అంటూ ప్రభావతి లక్ష్మితో బయలుదేరుతుంది. వీరు వెళ్లేటప్పటికి అన్నపూర్ణ ప్రయాణా

నికి సిద్ధంగానే వుంటుంది. అంతా కలిసి వేరొక బండిలో తోడుగా బయలుదేరిరి.

అందరు తోటకు చేరుకొన్నారు. ఆతోటలో రకరకముల పుష్పసంతతి వివిధములగు ఫలవర్గములు వారికి ఎదురు వచ్చి స్వాగతమిచ్చినవి. తోట ఘుమఘుమ వాసనలతో నిండిపోయినది. రకరకముల పుష్పరాజములు అప్పుడే వికసిస్తున్నవి. "ప్రభా ఏమిచేద్దాం?" అంటూ రాజ్యం ప్రశ్నించినది. "మనం నాలుగువైపులాపోయి వివిధ పుష్పాలను సేకరిద్దాం" అని ప్రభ నిర్దేశించినది. సరేనంటే సరేననుకొని రాజ్యం ఒకవైపు, ఇందిర, అన్నపూర్ణలు మరియొకవైపు. లక్ష్మి, ప్రభలు వేరొకవైపు పుష్పసేకరణకు పోయినారు. రాజ్యం మల్లెలను సేకరించినది. ఇందిరాదేవి మల్లెలను కోసినది. లక్ష్మి పన్నీరు పుష్పాలను కొమ్మనుండి సున్నితంగా త్రుంచినది. మిత్రవర్గము సేకరించిన పరిమళ సహిత వికసిత కుసుమములతో ఒకచోట చేరి మాలలు కట్టారు. మరికొన్ని పూలను అట్లాగే ఉంచారు. "మనం నదిలో స్నానం చేద్దా"మని ఇందిరాదేవి చెప్పినది. ఆ విషయం అందరూ అంగీకరించారు. పర్యవసానం నిర్మలోదకములో స్నానం చేశారు. తరువాత కార్యక్రమం కులాసా కబుర్లు. ఇందిరాదేవి తనభర్తగారి సాహిత్యసేవను, పవిత్రోద్దేశ్య ఆచరణను చక్కగా విశదీకరించినది. రాజ్యం తన భర్తగారి రసికత్వాన్ని వివరించగా మిత్రవర్గం ఆమెను వారి 'శోభనపురాత్రి' ముచ్చట్లను చెప్పవలసినదిగా కోరారు.

దానికి మొదట రాజ్యం అంగీకరించలేదు. కాని బలవంతం చేయటంవల్ల తొలిరేయి ఆనందాన్ని, మన్మథక్రీడ మనోహరత్వాన్ని రాజ్యం వివరించక తప్పలేదు. ఆమె ఈ విధంగా ప్రారంభించినది.

వివాహం అయినదేకాని మేము ఉభయులము కలిసికొని ఒకసారియైనా మాట్లాడుకొనటం జరుగలేదు. మావారు ఎన్ని విధాలనో నాతో మాట్లాడాలని ప్రయత్నించారు. నేను ఏకాంతంగా ఉన్నప్పుడు వారితో మాట్లాడవలెననే వాంఛ నాలో తొంగిచూచేది. తీరా సమయం వచ్చేటప్పటికి నాకు సిగ్గు వేసి వారికి కనబడకుండా దాక్కుండే దాన్ని. నా అవస్థను వారు గ్రహించి ముసిముసి నవ్వులు నవ్వేవారు. నన్ను ఎగతాళి చేస్తున్నారని నాకు కోపం వచ్చేది కాని ధైర్యంచేసి మాట్లాడలేక పోయేదానిని. ఇట్లా కొన్ని నెలలు గడచినవి. వారు ప్రతిపండుగకు ఆహ్వానింపబడేవారు. వారు ఉన్నన్నాళ్ళు నాలో సాహసం మాయమయ్యేది. మా అవస్థను గ్రహించామన్నట్లుగా మా పెద్దలు సుముహూర్తం నిర్ణయించారు. ఆరోజే మా శోభనం, అంటే మన్మథ పుష్పబాణాలకు మేము దాసోహం అన్న మధుర రాత్రి అదే. అదే మా 'శోభనపురాత్రి'. నేను గదిలోనికి పోయేటప్పటికి మా వారు గదిలో కుర్చీలో కూర్చొని ఏదో ఆలోచనలో మునిగియున్నారు. నన్ను లోనికి పంపి మా బంధువులు తలుపుకు బయట గొళ్ళెం పెట్టారు. ఆ గొళ్ళెం చప్పుడు విన్న మా వారు నన్ను చూడటం, ఆ చూపులను

గమనించిన నేను తలవంచి నేలరాయటం, ఒకేసారి జరిగినది. వారు దొంగచూపులుచూస్తు అలాగే కూర్చున్నారు. నేను అది గమనిస్తూ నిలుచొని ఉన్నా. నేను సాహసంచేసి వారిని సమీపిస్తానని బహుశా వారనుకొన్నారేమొ. లేక తాము ముందుగా త్వరపడకూడదనుకొన్నారేమొ. లేక నేను నీవే ఊహకున్న ముద్దురాలి గెలవలేవు, 'అని రాగాలాపన చేస్తూ వారికౌగిలిలో వ్రాలిపోతాననుకొన్నారో, సద్దులేకుండా కొంతకాలం గడిచినది. బయట మా బంధువుల గుసగుసలు వినిపించినవి. ఎదురుగాఉన్న కిటికీ తలుపులను మావారు చేరవేసి నన్ను సమీపించారు. సమీపించి నన్ను లాలిస్తూ కౌగిలిలోనికితీసికొని నాచెక్కిళ్ళను ముద్దుపెట్టుకున్నారు. నేను దూరంగా జరిగాను. 'ఏంరాజ్యం, ఇప్పుడూసిగ్గేనా' అన్నారు. నేను మౌనంగా ఊరకున్నాను. వారు నాకు చాలా విషయాలు చెప్పి నా సిగ్గు తొలగించారు. ఆ సమయంలో రతీదేవిప్రియుడు మాపై పుష్పబాణాలను మరొకసారి వదిలాడు. మా మేనులు పులకరించినవి. నాకు దగ్గరగా వారు జరిగి నన్ను కౌగిలిలోనికి తీసికొన్నారు. మరియొకసారి చుంబనం జరిగినది. గదిలో వుంచిన ఫలహారాలు మావైపు చూసి 'మా మాట ఏమనుకున్నార'ని ప్రశ్నించుతున్నట్లుగా మాకు గోచరించినది. ఉభయులం అచటి తినుబండారంలో కొంత తిన్నాం. నేను లేత తమలపాకులను ఈనెలుతీసి వారికిచ్చా. వారు అందుకొని నమిలారు. తర్వాత నేనూ వానిని స్వీకరించా. గదిలో వెలుగుతున్న దీపాన్ని చూసి మావారు

'ఎందుకింత వెలుతురు' అంటూ తగ్గించారు. ఆ రాత్రి తీయని తలపులతో, ఉత్సాహంతో, ఉద్రేకంతో, మధురానుభూతితో నూతనరుచిని చవిచూచాను. ఇది మా 'శోభనం రాత్రి' జరిగిన మరుపురాని మహత్తర సన్నివేశం అంటూ రాజ్యం ముగించినది.

'నాచేత అన్ని విషయాలు చెప్పించావు. మరి నీ వివాహం మాట ఏమిటి?' అని రాజ్యం ప్రభావతిని ప్రశ్నించినది. 'త్వరలోనే కాబోతున్నది. పెద్దలు సరే ననుటకు తరువాయి' అంటుంది అన్నపూర్ణ జవాబుగా. 'వరుడు ఎవరే?' అని రాజ్యం. 'మనగ్రామంవాడే' అని అన్నపూర్ణ. 'ఎవరో చెప్పరాదు. కొరవబెట్టకుండ' అని రాజ్యం. 'అన్ని విషయాలు అసలు వారినే అడగండి' అని అన్నపూర్ణ అనటంతో అందరూ నవ్వారు. ప్రభావతి కోపం తెచ్చుకుంటూ 'ఈ కొంటి మాటలు ఏమిటి, అన్నపూర్ణా' అని అన్నది. 'యథార్థం చెపితే అంతా ఇంతే' అంటుంది అన్నపూర్ణ. 'సిగ్గువచ్చిందికాబోలు. నీవేచెప్పు' అంటూ లక్ష్మి అన్నపూర్ణను అడుగుతుంది. 'మా అన్నయ్య ప్రసాదును వలచి వలపింపజేసికొన్నది. మీ కందరకూ ప్రసాదు తెలిసివుండవచ్చు. ఆయనయే మన ప్రభావతికి కాబోయే భర్త' అని అన్నపూర్ణ లక్ష్మికి జవాబు చెబుతుంది.

ఈ కొంటిమాటలకు సిగ్గుచెంది ప్రభావతి అచటినుండి లేచి, వంటశాలను సిద్ధంచేయుచున్న వెంకాయమ్మ వద్దకు

పోయినది. ప్రభావతివెళ్ళటంతో సంభాషణ ఆగిపోయినది. మిత్రవర్గం ఆమెను అనుసరించారు. అందరు వంటపనులలో వెంకాయమ్మకు సహాయంచేసి రుచ్యమా పదార్థాలతో భోజనం ముగించారు. అనంతరం అంతా విశ్రమించారు. కట్టిన పూలమాలలను జడలకు అలంకరించుకొని, తోటలోని చెట్ల సౌందర్యమును, ప్రవాహపు గమనమును వీక్షించారు. చల్లని గాలిని పీల్చారు. అంతా గ్రామంవైపు నడిచారు. కోసి తెచ్చిన పూలను ప్రభావతి ఇరుగుపొరుగువారికి పెట్టినది. ఆ పూవులోని తావిలాగా ప్రభావతిదాంపత్యం అనురాగపూరితమై, ఆదర్శయుతమూగాక అని దీవిస్తూ తెరను దించి మరియొక రంగాన్ని అలంకరిద్దాం.

# 9

రంగంలోనికి వస్తూ పోతున్న ఒక నటినిగూర్చి తెలిసికొనటం అవసరం ఇప్పటికే చదువరులు కుతూహలంతో పుటలుత్రిప్పి ఆమెవృత్తాంతంకోసం అన్వేషిస్తూ వుంటారు. అందుకే ఆమె గాథను వివరింపదలచినది నా చేతిలోని వంగరంగుకలం.

ప్రభావతి రామయ్యగారి ముద్దుల ఏకైక పుత్రిక. రంభాదులనుబోలు రూపం లేకున్నా మానవదైనందిన జీవి

తంలో మెరుగులు దిద్దగల ఆకారం ఉన్నది. శరీరంలో ఉడుకురక్తం ప్రవహించే రోజులవి. రతిక్రీడ రమ్యాత్వంకోసం ఎదురుచూచే దినాలవి. గొప్పగా చదువుకోలేదు. ఐనా శీల నిర్మాణంలో లోపంలేకుండా చేసికోగల సామర్థ్యం ఉన్నది. పుట్టింది పెరిగినది పల్లెటూరి వాతావరణములోనైనా ఆకర్ష ణీయముగా ఉండటం నేర్చుకొన్నది. ఇంకా ఒకరి జీవితంలో భాగస్వామి కాలేదు.

రామయ్య స్థితిమంతుడు. కుమార్తె వివాహవిష యంలో ఇంకా ఒక నిర్ణయానికి వచ్చినట్టులేదు. ఆమె అంద చందాలకు వయోగుణాలకు తగినవరుని అన్వేషిస్తున్నాడు. కాని వారి వాంఛ నెరవేరలేదు. ఆరోజు తీరికగా వీధి అరుగుమీద కూర్చొని వున్నాడు. ఇంతలో ప్రసాదు తల్లి పంపిన రమణయ్య అచటికి వచ్చినాడు.

" ఓహో, రమణయ్యగారు, ఇట్లా దయ చేశారేమి? "

" మొన్న మీకోసం వద్దామనుకొన్నాను. ఇంతలో మా పెద్దబ్బాయి మీరు గ్రామంలో లేరని చెప్పగా ఆవిష యాన్ని వదిలివేశా. ఎప్పుడు వచ్చారేమిటి? "

" నేను వచ్చేటప్పటికి రాత్రి చాల ప్రొద్దుపోయినది. లోనికి పోదాము రండి. "

" మన ప్రభావతి పరిణయము ఎంతవరకు వచ్చినది? "

"ఆ విషయమే ప్రయత్నిస్తున్నా. తగినవాడు దొరక లేదు."

"నేను చక్కని సంబంధాన్ని కుదిర్చాను. అమ్మాయి అందచందాలకు తీసిపోడు. కొంతవరకు చదువుకొన్నాడు. కృషిచేసి జీవితాన్ని సుఖప్రదంగా చేద్దామనే సంకల్పము కలవాడేగాని సోమరిగాడు. అనయనముల పుష్టిచేత అమ్మాయిని లాలించి, ప్రేమించి, సంతోషపరచగల సమర్థుడు—శక్తివంతుడుకూడా."

"వరుని వయోరూపాలు, విద్యతో నూతన విషయాన్నికూడా పేర్కొన్నారే. విశేషమేమి?"

"అన్నిటికన్నా ముందు వరునిదేహపుష్టి వానిలోని చైతన్యం గమనించవలసినవి. ఎంతవాడైనా ప్రియురాలిని మత్తెక్కించి తనకౌగిలిలో వ్రాలగలిగేటట్లు చేయగలప్పుడే తగినపతియని అనిపించుకొంటాడు. తీరని కోరికలతో, తృప్తిలేని జీవితముతో, ఎంతమంది మగువలు తెరవెనుక కళంకసహిత జీవితాన్ని సాగించటంలేదు. ఇందు మూలంగానే సంఘంలోనేడు వ్యభిచారి మహామారి వృద్ధిచెందుచున్నది. వరుని ఎన్నికలో ప్రత్యేకశ్రద్ధ పూనుకొనక తమ కుమార్తెలను పరోక్షంగా వ్యభిచారానికి తల్లిదండ్రులు దాసోహం చేయించుచున్నారు. అట్టి తల్లిదండ్రులు అపరాధులు. ఈ వ్యభిచారిపిశాచిని సంహరించాలంటే వృద్ధ

వివాహాలను అరికట్టాలి. సమర్థులు శ క్తివంతులగు యువకు లను ఎన్నుకొని వివాహకార్యాన్ని ముగించాలి."

" రమణయ్యా. ఇంతకు ఇంతటిగుణగణాలతో శారీ రక నైతిక బలాలతో వెలుగుచున్న వ్యక్తి ఎవరండి ? "

"మనగ్రామంలోనున్న విద్యాపతి సుందరయ్యగారి కుమారుడు ప్రసాదు."

" మీరుచెప్పినమాట నిజమేనండి. ఈవిషయం గమ నించకుండా ఇన్నాళ్లు వృథాగా గడిపాను."

" ఇప్పుడు మించిపోయినది ఏమీలేదు. తమరు సరే నంటమే కొరవ. ముహూర్తాలు ఈమాసంలోనే వున్నవి."

"ఐనా మీరు ఈమాట ఇన్నాళ్లనుండి చెప్పలేదేం? "

"నీకు ఈ విషయం ఎప్పుడో చెప్పేవాడిని. మీరు ఇతరత్రా గొప్ప సంబంధాలు చూస్తున్నారని తెలిసి మానం ధరించాను. పైగా ఇంకొకటి. మీరా స్థితిమంతులు-వారా సామాన్యులు. ఈ విషయం చెప్పిన ఏమనుకొంటారో నని ఊరుకున్నాను."

" సుందరయ్యగారి సంపద మాతో తీసిపోదులేండి. విద్యావంతుడు, వినయవంతుడు, రూపసియైనవానికి విత్తము లేకున్నా ప్రభావతిని ఇద్దామనుకొన్నాను. నాకుమాత్రము ఎవరున్నారండీ ? నా ఆస్తికూడా వారికే గదా ? "

"ఇంకొక మాట మరిచా. ప్రభావతి-ప్రసాదులు పరస్పరం ఆకర్షించుకొన్నారు. వారి ప్రేమను గమనించి సుందరయ్యగారిభార్య నన్ను మీ వద్దకు పంపినది. ఇక మీ ఇష్టంమీద చరిత్ర ఆధారపడి వున్నది."

"రమణయ్యా, ప్రేమయని, ప్రేమించుకొన్నామని, ప్రేమించి పెండ్లిచేసికొంటామని, అంటూ ప్రతి నవలలోనూ పల్కుతున్నారు. ఇదీ అంతేనా?"

"రామయ్యా! ఆ నవలలలోని ప్రేమ కల్పితము. అందలి చిత్రరచన వాస్తవికతకు చాల దూరం. పరస్పర ఆకర్షణకు లోనైన యువతీ యువకులు జాగ్రత్తగా రెండవ వారి జీవితాన్ని గమనించాలి. దూరంగావుండి వారి దిన చర్యను తెలిసికోవాలి. వారివారి ఆశయాలు భిన్నం కాన ప్పుడు వివాహం వారిరువురిమధ్య జరగటం ఉత్తమం. అంటే కొన్నాళ్ళు ఒకరిని ఇంకొకరు గూఢచారిగా అనుసరించి ఆలోచించుకోవాలి. ఈ విధంగా మన ప్రభావతివివాహం జరుగబోవుచున్నది. ఇక వారి జీవితంలో కళంకంగాని క్లేశం గాని ఉండబోదు. ఈమాట విన్నారూ; నాళ్ళ అన్నపూ ర్ణకు పునర్వివాహం చేస్తారట. నిన్న ఎవరినో తీసికొని వాండ్ల రఘు వచ్చాడని, ఆ అమ్మాయి అంగీకరించలేదని వినికిడి."

"ఈవిషయం ఇంకా వినలేదండీ. అయినా పున ర్వివాహం చేయవచ్చా. శాస్త్రరీత్యా తప్పుగదండీ?"

"శాస్త్రదృష్ట్యా ఏమోకాని, వాండ్ల రఘు ఈ విధంగా సమర్థిస్తున్నాడు. 'యౌవనప్రాయంలో వున్న యువతి మధురానుభూతికై ఎదురుచూస్తుండటం సహజం. ఆ మధురానుభూతి మన్మధక్రీడ. ఉద్రేకంలో విచక్షణాజ్ఞానం నశిస్తుంది. ఆ ఉద్రేకానికి లొంగిపోయి వ్యభిచరిస్తే ఏమవుతుంది? మహానుభావులుకాని ఇంద్రియనిగ్రహం చేయలేరు. వారుకూడా అల్పసంఖ్యాకులే. ఉద్రేకానికిలొంగిపోతే వ్యక్తి శీలంలో మచ్చ ఏర్పడుతుంది. సంఘంలో నైతికసూత్రం పతనమౌతుంది. ఈ తెరచాటు జీవితానికి దారిచూపేదానికంటే వివాహం చెయ్యటం ఉత్తమం. జీవితానందాన్ని, దాంపత్యమాధుర్యాన్ని విరహవేదనతోపాటు హృదయవేదన పొందుతున్న యువతికి సమకూర్చటం సమంజసం."

"ఈ వాదన సమర్థనీయంగా వున్నది."

"మన సమాజంలో కొన్ని అవకతవకలు మెండుగా నున్నవి. ధనవంతులకు, పలుకుబడి గలవారికి, సమాజం దాసోహం అంటున్నది. వారు నీచులైనా గౌరవించి అగ్రతాంబూలం ఇస్తుంది. ఉత్సాహవంతులైన యువకులు ఈ రంగంలో ప్రవేశిస్తేగాని పరిస్థితులుచక్కబడవు. సమాజ ఔన్నత్యానికి ఏనాటికైనా వారే కారకులు. పని వున్నది వస్తా" అంటూ రమణయ్య రంగంనుండి నిష్క్రమిస్తాడు. ఈవిధంగా ఒకనాడు పూవులోని తావి నలుదిశలా వ్యాపించినది.

# 10

ఇంటికివచ్చిన రఘును కూర్చోమంటూ ప్రసాదు నిల్చుంటాడు. ఉభయులు కూర్చున్న తర్వాత సంభాషణ ప్రారంభమౌతుంది.

" ఊరినుండి ఎప్పుడు వచ్చావు ? ఇప్పుడు శెలవలు లేవుగా ? "

"అవసరమైనప్పుడు అన్నీ శెలవలే. నిన్ననేవచ్చాను'.'

" క్రొత్తవారిని ఎవరినో వెంటబెట్టుకొని వచ్చావట. ఏమిటి విశేషం ? "

" మన అన్నపూర్ణకు సంబంధం తీసికొనివచ్చాను. మనమాటలను ప్రయత్నాలకు వారి తొలిచూపులు మూలం కదూ. వరుడునాకు పరిచితుడు. విద్యావంతుడు. ఇప్పుడిప్పుడే సంపాదనలో ప్రవేశించాడు. వితంతు వివాహానికి సమ్మతించాడు.

" తొలిచూపులు ముగిసినవిగా మరి వారి వారి అభిప్రాయాలు ప్రోత్సాహకరంగా వున్న వా? "

" వరుడు వధువునుచూచి అంగీకారం తెల్పాడు. వధువుదానికి ప్రతికూలభావాన్ని తెలియపరిచింది. అంతటితో ఆవిషయం ఆ సంబంధం ముగిసిపోయినది. తిరిగి ఇంకొకసారి అన్వేషించాలి. "

"ఒక మాట. ఒకసారి నేను వితంతు వివాహాలను గూర్చి మనరామంతో ముచ్చటించా తాను ఒక వితంతువును చేబట్టి ఇతరులకు మార్గదర్శకుడు కావటానికి అనుకూలభావాన్ని అతడు ప్రకటించాడు. మన అన్నపూర్ణ విషయము చెప్పి వాని అభిప్రాయము తెలిసికొంటాను. నీవు రెండురోజులుంటే పరిస్థితులను చక్కబరిచి నీకు ఉత్సాహాన్ని కలిగిస్తాను."

"ప్రసాద్, ఈవిషయంలో తగిన సహాయంచేసి మిత్ర ధర్మాన్ని నిర్వర్తించు. నేను నీకు కృతజ్ఞుణ్ణి. నా చెల్లెలి బాధాకలితగాధ స్ఫురించినపుడు నామనస్సు వికలమైపోయేది. ఈవిధంగా ఆమెకోసం నేను ఎంతగా దుఃఖించుచున్నానో ఎవరికి తెలుసు? ఆమెజీవితములో పూర్ణసుధాకరుని వెలుగు గోచరింపచేయటం నా ధర్మం అనుకొని ఇన్నాళ్ళనుండి ప్రయత్నిస్తున్నాను. అయినా అనుకూలపరిస్థితులు అందుబాటులో లేక నా యత్నాలు నిష్ప్రయోజకములైనవి. ఆమె తిరిగి ఆనందము పొందినప్పుడే కర్తవ్యం నిర్వహించితినిగదా యని గర్వం నాలో తొంగిచూస్తుంది. ఆమె సంతోషంతో నా జీవితసౌఖ్యానికి, దాంపత్యమాధుర్యానికి పునాదులు నిర్మిస్తా. ఆ శుభోదయం ఎప్పుడో?"

"రఘూ, నేనుకూడా ఆమె సౌఖ్యానికి ఎదురు చూస్తున్నా. ఈ విషయమే ఆలోచిస్తూ అన్వేషిస్తున్నా. నా మాట రామం కాదనడు. తప్పక నాపట్టుదల నెరవేరుతుంది."

ఇంతలో గడియారం టంగున గంట కొట్టినది. ఇద్దరూ ఒకేసారి 'మన భావికార్యక్రమానికి ఇది ఒక విజయసూచన' అంటారు. అంతటితో ఆ రంగం ముగుస్తుంది. తెర ఎత్తగానే రామం గదిలో కూర్చొని ఏదో వ్రాసికొంటూ వుండటం గోచరిస్తుంది.

ఒకమూలగానున్న టేబిల్ పై పుస్తకాలు నిర్లక్ష్యంగా పడివుండటం కనపడుతుంది. గోడలకు ఆకర్షణీయమైన చిత్రాలు అలంకరించబడినవి. కలం కదలికచే కలుగు శబ్దం తప్ప ఇతరత్రా సద్దులేదు. నిశ్శబ్దతతోగాని కలం కదలను కాబోలు. రచన సాగాలంటే రచయిత ఉద్రేకపూరితుడు కావటంతోపాటు పరిసరాలు ప్రశాంతంగా వుండాలి. ఆ సమయంలో వాని భావాలు కేంద్రీకరిస్తవి. వాని లక్ష్యం సాక్షాత్కరిస్తుంది. ఫలితంగా వాని కలం కడు వేగంతో ముందుకుసాగి మానవజీవితములోని ఒక మహత్తరఘట్టాన్ని, ఒక విచిత్ర సంఘటనను చిత్రిస్తుంది—చిత్రించి ఇతరులకు సందేశాన్ని అందజేస్తుంది. ప్రజాకోటిలో చైతన్యాన్ని రగుల్కొల్పుతుంది.

వ్రాస్తున్న వ్యాసం ముగిసినట్లున్నది. వ్రాసినదానిని ఒకసారి మౌనంగా పఠిస్తున్నాడు. ఆ సమయంలోనే ప్రసాదు రావటం, కూర్చోటంకూడా జరిగినది. మిత్రుని రాకతో గది లోని మౌనం తొలగిపోయినది. స్పష్టమైన స్వరాలు వినపడు చున్నవి.

"ఏమిటోయ్. దీక్షగా చదువుచున్నావు?"

"ప్రసాద్, నాలాటి వారికి పనేమున్నది. ఉత్తమరచనలను చదవటం, మహాత్ముల సందేశాలను అందుకొనటం, వారి సలహాలతో జీవితరంగాన్ని చక్కగా అలంకరించి ప్రేక్షకులకు ఉల్లాసం కలిగిస్తూ ప్రబోధించటం. ఇదే నా దైనిక కార్యక్రమం. ఈవిధంగా ఇంతవరకు సాగుచున్నది."

"అయితే, ఆ చదివేవిషయం తమరు వ్రాసినదేనా? ఒకసారి చదివితే నేనూ వింటాను. నీలాటిమిత్రుడున్నప్పుడు నాకు నిరంతరం వినోదం. పైగా హృదయాన్ని వేధించి బాధించే సమస్యలు పరిష్కారంకావటం కూడా జరుగుతుంది."

"ఇంతకూ ఆవిషయంలోని ప్రధానవస్తువేమిటి?"

"ముఖ్యవస్తువు వ్యభిచారం. ఉద్దేశ్యం సమాజంలోని అవినీతిని నిర్మూలించి ఆదర్శయుత జీవితాలను గడపటానికి దారిచూపటం. ఈ విషయం సులువైనదికాదు."

"వ్యభిచారమనేది గడ్డుసమస్య. ఈ సమస్యా పరిష్కారం ఉభయజాతుల సహకారంపై ఆధారపడివున్నది. రెండుహస్తాలమూలంగా శబ్దం కలుగుచున్నది. ఒకరి అహ్వానాన్ని రెండవవారు తిరస్కరించినప్పుడే వ్యభిచారానికి ఫుల్‌స్టాపు పెట్టటం జరుగుతుంది. అంతవరకు ఇది ప్రబలిపోతుంది. నీ అభిప్రాయాలను వివరించు వింటాను."

రామం తన అభిప్రాయాలను ఉదహరణతో వివరించాడు. తరువాత ప్రసాదు వానికి 'అన్నపూర్ణ విషయం' చెప్పి ఆమెను వివాహము చేసికొనుటకు సమ్మతించునట్లు చేస్తాడు. ఈవిధంగా ప్రసాదు తాను చిరకాలంనుండి ఆలోచించు సమస్యను పరిష్కరిస్తాడు. అన్నపూర్ణ జీవితరంగంలో చంద్రోదయమగునట్లు చేయుటయే ప్రసాదును ఎదుర్కొన్న సమస్యయని తెలిసికొందురుగాక.

# 11

అన్నపూర్ణను, రామం వివాహంచేసికొనడానికి సమ్మతిస్తాడు. అందుకు అన్నపూర్ణ అంగీకారం చూపినది. ఒక సుముహూర్తాన వారిరువురికి వివాహం జరిగినది. వారిరువురు గృహిణీ గృహస్థులౌతారు. గురుతర భాధ్యతను స్వీకరిస్తారు.

ప్రభావతి ప్రసాదుల పరిణయం స్థిరపడినది. ఉభయ పెద్దలు ముహూర్తం పెట్టుకొనడం, తాంబూలం తీసికొనటం జరిగినది. వివాహయత్నాలు చేసికోటానికి ఒక నెల రోజులు గడువు ఉన్నది. పనులు చురుకుగా చేస్తున్నారు.

ఇక విజయను విచారించుదాము.

# 12

అది మాధవరావుగారి గృహం. లోపల మాధవరావు పడకకుర్చీలో పడుకొని వార్తాపత్రిక చదువుచున్నాడు. ఇంతలో వారిభార్య రాజమ్మ కాఫీ తీసికొనివచ్చి బల్లమీద ఉంచినది. పరధ్యానములో నున్న మాధవరావు, భార్య హెచ్చరికతో కాఫీగ్లాసు తీసికొని త్రాగాడు. అనంతరం

"ఏమండీ, రఘువద్దనుండి జాబువచ్చినదా? ఎందుకో గాని ఈసారి జాబువ్రాయలేదు. ఎప్పుడూ ఇంత ఆలస్యము చేసేవాడుకాదు. బహుశా బలవత్తరమైన కార్యం ఉండవచ్చు. లేదా తీరికలేక పోవచ్చు."

"నీవుచెప్పిన మాటనిజం. జాబువ్రాయుటంలో ఎప్పుడు జాలం చేసేవాడు కాదు. ఈరోజు తప్పక జాబు వస్తుంది."

"తెంపులేకుండా కాకి అరుస్తున్నది. జాబుగాని,బంధువుగాని, రావటం తప్పదు."

"అమ్మాయి ఏంచేస్తున్నది?"

"ఇప్పుడే మేడమీదికి పోయినది. సరేకాని, మన అమ్మాయి 'శోభనం' గూర్చి ఏమిఆలోచించారు? వివాహం అయి సంవత్సరం కావస్తున్నది, అన్ని ఆటంకాలు తీరిపోయినవిగా."

"మనం త్వరపడితే ఎట్లా? వారినుండి కబురు వస్తే మనము కాదన్నామా?"

"తొందర గాదటండి. పక్క ఇంటివారికోడలు కాపరానికివచ్చి సంవత్సరం అయినది. దొండపండులాంటి పిల్లవాడినికన్నది. మన అమ్మాయి ఓ పిల్లవాడిని కంటే నాకు ఎత్తుకోవాలని, ఉత్సాహంగా ఉన్నది."

మాధవరావుగారూ, అంటూ వీధిలో ఎవరో పిలిచిన శబ్దం వినపడుతుంది. మాధవరావు లేచి వీధిలోనికి పోవటం, పోష్టుజవాను ఇచ్చిన కవరు తీసికొనటం, లోనికి రావటం జరిగినది.

"జాబు ఎవరు వ్రాసినారండి."

"ఇంకా చించలేదు." అంటు మాధవరావు కవరు చించి చదువుతాడు.

"మా అన్నయ్య వ్రాసినాడు. రఘు వారం రోజుల క్రిందట అచటికివచ్చి, తిరిగి పట్నం పోయినాడట. అంతా కులాసా అని కోడలి విషయం వ్రాయమన్నారు ఇంకో మాట. ఈమాసంలో ముహూర్తాలు ఉన్నవట. మంచిరోజు చూసి అవుపోసన కార్యం ముగించమని వ్రాశారు."

"మనం అనుకొనటం — వార్తరావటం. బాగా ఉన్నది. పురోహితుడిని పిలిచి మంచిరోజు కనుక్కోండి" అంటూ రాజమ్మ లోనికి పోయినది.

" అబ్బాయి వేణుకుకూడా వివాహంచేస్తే నాబాధ్యత తీర్చుకున్నట్లగుతుంది. వేలకువేలు కట్నమిస్తామంటు చాలా మంది వస్తున్నారు. ఇందులో ఏది కుదురుతుందో ? గోపాల శాస్త్రివచ్చి మాట్లాడిపోయినాడు. ఆ సంబంధం తెలిసినదే చాలా యోగ్యులుకూడా. అయినా అబ్బాయి అభిప్రాయం కనుక్కోవాలి." అని ఆలోచించుకొని 'వేణూ' అని పిలిచారు. వేణు వచ్చాడు.

" నాన్నగారూ, ఎందుకండీ ! పిలిచారా ?"

" కూర్చో నాయనా. నీతో మాట్లాడాలి."

" గోపాలశాస్త్రి గారిని తెలుసుగా. మనయింటికి తరచుగా వస్తుంటాడు. వారిఅమ్మాయి సరస్వతిని నీకు ఇవ్వాలని కుతూహలంతో ఉన్నాడు. ఆఅమ్మాయి కొద్దిగా చదువు కొన్నది. రూపసికూడా ."

" ఇప్పుడే నాకు పెండ్లి చేయవద్దండి. నాచదువుపూర్తి అయి స్వతంత్రజీవనం చేసేటప్పుడు వివాహం చేసికోవాలని నా వాంఛ. దీనినిమీరు తిరస్కారంగా భావించవద్దు. ఈసంబంధంతో నాజీవితానికి ఒకహద్దుఏర్పరచకండి."

" మనకు ఉన్నది చాలకనా ఆర్జించటం. నీకుస్వయం సంపాదనయందు అభిలాషఉంటే నేనుకాదనను. కాని, నీఅభిలాషకు, వివాహం ఏవిధంగానైన ఆటంకం కలిగించదని చెబుతున్నా."

నాన్నగారూ, పెద్దలు సపాదించి యిచ్చిన, ఆ స్థితో కాకుండా ప్రతివాడు ప్రయత్నించి, ఆర్జించి, తృప్తిపడటం మంచిది. అప్పుడు వ్యక్తిలో ఉత్సాహం ఉజ్వలంగా, ప్రకాశిస్తుంది. వానికార్యదీక్ష ప్రకటితమౌతుంది. వాని సమర్థత చాటబడుతుంది. నా భావిజీవితరథాన్ని ఒక క్రొత్త మార్గంలో నడిపించటానికి నేటినుండే నేను ప్రయత్నిస్తున్నా. నా ప్రయత్నానికి మీరు చేయూతనివ్వండి.''

"నీ అభిరుచి బాగానే ఉన్నది. ఒకసారి ఆ అమ్మాయినిచూడు. ఆ తొలిచూపుల ఫలితం ఏమగుతుందో? తర్వాత నీ యిచ్చవచ్చినట్లు చేయవచ్చు. వారికోరికను కాదనకుండా చేసినవారమౌతాము. నీకు నచ్చకుంటే నేను మాత్రం బలవంతం చేస్తానా?''

"ఎందుకునాన్నా ఈ చూపులు. క్షమించండి. మీ మాటకు ఎదురు చెప్పవలసి వస్తున్నది. నామార్గాన నన్ను నడవనివ్వండి. నా ఆశాజ్యోతిని వెలిగించుకోనివ్వండి. నా జీవితలక్ష్యాన్ని నిర్ణయించుకోనివ్వండి'' అంటూ వేణు అచటనుండి తొలగిపోయినాడు. ఆవిషయం నాటికి ముగిసినది. పునస్సంధానానికి ముహూర్తం నిశ్చయమైనది. మాధవరావు ఈ విషయం రఘు తండ్రికి తెలియచేశాడు. నాడు విజయలో సిగ్గు తెరవ్రాలినది. ప్రత్యక్షంలో సిగ్గు ఉండటం, పరోక్షంలో మధురమైన కోరికలు ఉత్పన్నం కావటం అలాటి అవస్థలో నున్నవారికి క్రొత్తకాదనుకుంటూ ముందుకు సాగుదాం.

# 13

ఆ నాడు రామయ్యగారింటిలో హడావుడిగా ఉన్నది. విషయం ఏమిటా అని విచారిస్తే కుమార్తె ప్రభావతివివాహం. వరుడు ప్రసాదు—ఆగ్రామంలోనివాడే. వాకిలిముందు పెద్ద పందిరివేసి ఉన్నది. పచ్చని తోరణాలు పందిరిని అలంకరించి నవి. ఒకవైపు మంగళవాయిద్యములు మ్రోగుచున్నవి. ఒక వైపు బంధువులు, మిత్రులు కులాసాకబుర్లు చెప్పకొంటు న్నారు. మరియొకవైపు పిల్లలు ఉత్సాహంతో ఆడుకొంటు న్నారు.

ముహూర్తం రాత్రికి. వరుడు తన బలగంతో వచ్చి విడిది దిగినాడు. చంద్రుని వెలుగుతో వరుడు కోవెలకు కారులో పోయినాడు. వానివెంట మిత్రులు రామం, రఘు వున్నారు. తర్వాత కొంతసేపటికి వధువు కారులో కోవెలకు వచ్చినది. ఆమెను ఉభయపెద్దలు, బంధువులు అనుసరించారు. కారు కోవెలవద్ద ఆగగా వధువు క్రిందికి దిగినది. తమ తమ పక్షముల ననుసరించి బంధువులు రెండుగా చీలినారు. ముందుగా వధువును ముందడుగు వెయ్యమన్నారు. తనవారి నివారింపుతో వధువు ఆవిధంగా చెయ్యలేదు. వరుడుకూడా ససేమిరా అన్నాడు. గత్యంతరంలేక వధువు ముందునకు నడిచినది. తర్వాత వరుడుకూడా. ఉభయులూ—వధూవరులు సమీపించారు. ముందుగా వధువు వరుని మెడలో పూదండ వేయటం, తదుపరి వరుడు వధువు గళసీమను పుష్పమాల చేత అలంకరించటం జరిగినది. ఉభయులు లోనికిపోయి,

దేవునికి నమస్కరించి కానుకల నర్పించినారు. ఆ యువతీ యువకులను 'అనురాగపూరితులౌదురుగాక' అంటూ భగవంతుడు దీవించటం ఆసమయంలో గుడిగంటలు మ్రోగటంచేత ఎవ్వరూ వినలేదు. వధూవరులు కూర్చోగా కోవెలనుండి కారు ఇంటిముఖం పట్టినది. ఎవరి శిబిరాలకు వారు చేరుకొన్నారు.

వరుడు మంగళస్నానం చేశాడు. తన మిత్రులతో, బంధువులతో, వధువుగృహానికి—వివాహమంటపానికి తరలి వచ్చాడు. ఏవిధమైన ఒడిదుడుకులు లేకుండా వధువు ప్రభావతి మెడలో, వరుడు ప్రసాదు మంగళసూత్రం ముడివేశాడు. ఈ మంగళసూత్రం మన హిందూసంఘంలో పవిత్రమైనది—బలవత్తరమైనది. ఇది రెండుమార్గాల నడిచే బాటసారులను ఒకచోట కలిపి, ఒకరికొకరు తోడుగా ఈ విశాలవిశ్వంలో సంచరించేటట్లు చేస్తుంది. ఇది ఉభయులను సన్నిహితం చేస్తుంది. బాధ్యత ఎరుగక స్వేచ్ఛగా తిరిగేవారి స్వాతంత్ర్యాన్ని ఇది బంధిస్తుంది. వారి స్వేచ్ఛకు ఒక హద్దును నిర్ణయిస్తుంది. గృహిణియని, గృహస్థుడని ప్రత్యేక పేర్లనుకల్పించి, గురుతరబాధ్యతను భుజస్కంధాలపై మోపుతుంది. యువతీ యువకులు అనురాగపూరిత హృదయాలతో నిర్మలానందమున పరవశులగుటకాని, కలిసి కలియని హృదయాలతో, తృప్తితీరనికోరికలతో, అనుమానాలతో, వ్యథతో, బాధతో జీవితరంగంనుండి నిష్క్రమించటం ఈ మంగళసూత్రమూలంగానే. ఇది వివాహఘట్టానికి సంబంధించినంతవరకు వివరించిన విషయం.

మరునాడు గానసభ జరిగినది. మృదుమధురగాన సుధారస తరంగాలతో శ్రోతలను ముగ్ధులనుగావించి, వారి సత్కారాలను, ప్రశంశలను, ఆహ్వానిత సంగీత కళారాధకులు అందుకొన్నారు. నాటి సభకువచ్చిన శ్రోతలలో కవులు, పండితులు కూడా ఉన్నారు. అనంతరం కవితాగోష్ఠి. నన్నయ కలం కదలికతో ప్రారంభించి నేటి రచయితలవరకు ఏ విధంగా తెలుగుకవిత్వం, తెలుగుగద్యం వివిధ పరిణామాలను చెంది ఈ నాటిరూపానికి వచ్చినది; కవి, చదువరులలో, శ్రోతలలో ఏ విధంగా చైతన్యం రగుల్కొల్పి వారిని జాతి ఔన్నత్యానికి, సంఘాభివృద్ధికి వినియోగించేది—పలువురు సాహిత్యరంగంలో తాముచేసిన కృషిని వివరించారు.

వివాహం అధ్యాయంలోని తరువాయి ఘట్టాలు ముగించబడినవి. నాటి రాత్రి 'నవ్యకళ' వారు 'ఆధునిక లోకం' అనే అభినయం ప్రదర్శించారు. 'ఆధునికలోకం'లో సమాజంలోని ఒక సామాన్యుడు తన జీవితయాత్ర నిర్వహణంలో క్షణక్షణం ఎదుర్కొనే సమస్యలు, ఆ సమస్యా పరిష్కారంకోసం వాని ఊహాసౌధాలు, ఆచరణలో పడే పాట్లు సహజంగా చిత్రించబడినవి. ఇది అందులోని శిల్పం. సంభాషణలు చమత్కారంగాను, వినసొంపుగాను ఉన్నవి. తగినచోట్ల భావసహితమైన పాటలు, నటులందరూ 'ఇది రంగస్థలం, నేను నటిస్తున్నాను' అనే మాట మరచిపోయి పాత్రలను చక్కగా నిర్వహించారు. రంగాలంకారం

రమ్యంగా ఉన్నది. ప్రతిదృశ్యం ప్రేక్షకుల కనులపండువగా మనోరంజకంగా ఉన్నది. తెరవ్రాలటం, తిరిగి యవనిక ఎత్తటం ఆలస్యం లేకుండా జరగటంవల్ల వారిలోని ఆతురతను అభివృద్ధి పరచినది. చాకచక్యంతో, కడుసమర్థతతో పాత్రలను నిర్వహించినవారికి ఉభయపెద్దలు ప్రత్యేకంగా సత్కరించి సంతోషింప చేసారు.

ఒప్పగింతలయినవి. వధువు అత్తగారింటికి తరలినది. గృహప్రవేశం అయినారు. ప్రభ సిగ్గుచెంది పేరుచెప్ప లేదు. అయినా ముత్తయిదులు బలవంతంచేసి ఆమెచేత, తర్వాత అతనిచేత పేర్లు చెప్పించారు. ఆ స్థితిలో తాము ఏ విధంగా సిగ్గుచెందినది గతాన్ని ఒకసారి ఊహించుకొంటే ముత్తయిదులు వారిని ఆ విధంగా బలవంతం చేసేవారుకారు. కాని ఆసమయంలో ఆ సంతోషంలో వారు దీనిని స్మరించరు. ఎవరైనా అడిగితే అది ఒక ముచ్చటంటూ సమర్థిస్తారుకూడా. మూడు రోజులు ముచ్చటగా దొర్లిపోయినవి. మూడు నిద్రలు ముగిసినవి. వచ్చినవారు స్వస్థానములను చేరుకొన్నారు. అల్లుడు ఆరగింపుకోసం మామగారింటికి భార్యతో పోయినాడు. అచట ఉన్న దినాలను క్రీగంటిచూచూపులతో ముసిముసి నవ్వులతో, సంభాషణతో వుభయులు వినియోగించుకొన్నారు. అందులో ముందడుగు వేసినది ప్రసాదని మరిచిపోనాకండి.

ఒకనాడు ప్రసాదు పుస్తకం తీసికొని డాబామీదికి పోయినాడు. అది సాయంత్రం. డాబామీద ప్రభావతి

కురులు సింగారించుకొంటున్నది. ప్రసాదు చప్పుడు లేకుండా వచ్చి దూరంగా కూర్చుంటాడు. వెనుకకు చూచిన ప్రభావతి లేచి నిలుచుంటుంది. ఏదో మిషపై ప్రభావతిని ప్రసాదు పిలిచి ఆలింగనం చేసికొని "ఆనాడు నా కోరికను తిరస్కరించావు. ఈనాడు నీవు కాదనలేవుగా" అంటూ నునుపాటి ఆమె లేత చెక్కిళ్ళను ముద్దుపెట్టుకొన్నాడు. నిజంగా వివాహం కాగానే వధూవరులు ఒకరితో ఒకరు భాషించుకోవాలని ఎంత సంబరం పడుతుంటారో, ఒకరి నొకరు క్రీగంట చూడాలని ఎంత కుతూహలంతో వుంటారో విదితమే. అయినా పెద్దలు ఆ అవకాశాన్ని కల్పించరు.

వారి సంభాషణను విని అందరు విడ్డూరంగా చెప్పుకొన్నారు. కాని వారుమాత్రం రతీరమ్యత్వం కోసం ఎదురుచూస్తున్నారు. మన్మథుడు వింటబాణం సంధించాడు. ఇక ఆ సుముహూర్తం ఎప్పుడో ? పూవు వికసించినపుడు తావిచే ఆకర్షింపబడిన భ్రమరం, దానిపైవ్రాలి చుంబించటం తెలిసికొన్న పెద్దలు త్వరపడటం మంచిదనుకొంటూ.

# 14

అవి వెన్నెలరాత్రులు. చంద్రుని మనోహరత్వము, ప్రభ, దినదినమునకు వృద్ధియగుచున్నది. ప్రకృతి ఆనంద దాయకముగా నున్నది. రతీరమ్యతకు వెన్నెలరాత్రులు సహాయపడునని కళాలేఖకులు నిర్వచించియున్నారు. అందు వల్లనే కాబోలు పునస్సంధానమును ఆ రాత్రులలో జరుగు నట్లు పెద్దలు నిర్ణయించారు.

ఆనాటి సాయంత్రంబండికి రఘు తన మామగారింటికి వచ్చాడు. వానివెంట మిత్రుడు ప్రసాదు, బావ రామం, చెల్లెలు అన్నపూర్ణ, తల్లిదండ్రులు వచ్చారు. ఆ మరునాడే విజయరఘుల 'శోభనపురాత్రి'. అందువల్లనే ఇందరుపెద్దలు వచ్చిరి. వీరి రాకకు ఎదురుచూచుచున్న మాధవరావు, రాజమ్మ బంధువులకు తగిన మర్యాదలు చేసిరి. రఘు మామగారికి, బావమరది వేణుకు, రామం, ప్రసాదుల పరిచ యము చేశాడు. అనంతరం యువకులు సంభాషణలో లీనమై పోయిరి, మాధవరావు వియ్యంకుని లోనికి తీసికొని పోయినాడు. రాజమ్మ వియ్యపురాలిని, అన్నపూర్ణను తీసికొని మేడమీద కుమార్తె విజయ వున్న గదికి పోయినది. అచట విజయనుచూచి అన్నపూర్ణ ఆనందించినది. వారుభ యులు కలిసికొని చాలకాలమయినది. చాలాకాలమైనపిదప ఆత్మబంధువును కలిసికొనినపుడు కలుగు సంతసము, ఉత్సా హము నిర్వచింపరానివి. అది ఊహాజనితముకాదు—అనుభవ

నీయము. అన్నపూర్ణ, విజయులు, ఏమేమో ముచ్చటించు కొన్నారు. తరువాత వారిరువురు తోటలోనికిపోయి పరిమళ మును వెదజల్లు పూవులను కోసి మాలలనుకట్టారు. భూదేవి దినకరుని సాగనంపి శశాంకునకు స్వాగతమిచ్చినది.

భోజనము లయినవి. ప్రసాదుకు వేరు గదిలో పడక అమర్చబడినది. రామం, రఘులకు ప్రత్యేకగదులు. రఘు తన గదిలోనికి పోయినాడు. గదిలో విద్యుద్దీపము వెలుగు చున్నది. కుర్చీలోకూర్చొని రఘు ఓ. సో. క. వ్రాసిన 'రతీ రమ్యత'ను చదువుచున్నాడు. ఓ. సో. క. ప్రత్యేకముగా యువకులకు 'శోభనపురాత్రి'ని గూర్చి హెచ్చరించారు.

స్త్రీలకు సిగ్గు అనేది సహజం. అందులో తొలిరేయి ఆ సిగ్గు—బెదురు ప్రస్ఫుటమగుట నూతనవిషయముకాదు. ఆనాడు హృదయములో నిండియున్న కోరికలను ప్రత్య క్షంగా, శారీరకంగా అనుభవించబోతున్నదికాబట్టి, ఆమెలో ఒకవిధమైన జంకు ఉత్పన్నమౌతుంది. పురుషుడు త్వరపడక నిదానంగా మాటలతో లాలించి ఆమెలోని సిగ్గుతెరను తొలగించటం అవశ్యం కర్తవ్యం. త్వరపడితే జీవితంలో దాంపత్య మాధుర్యాన్ని కులసతిద్వారా గ్రహించలేడు. కాబట్టి గదిలో నాడు ఉత్సాహంతో, సహనంతో ప్రవర్తిం చాలి. శాస్త్రరీత్యా స్త్రీకి పురుషునికంటె కామం మెండు. పురుషుడు త్వరగా ఉద్రేకపూరితుడౌతాడు. స్త్రీ ప్రకృతి ఇందుకు భిన్నం. పురుషుడు ప్రేరేపించితేగాని, స్త్రీ సృష్టి

కార్యంపట్ల సుముఖురాలు కాదు. ఇది తరతరాలనుండి వచ్చు చున్న మగువల స్వభావం. కావున పురుషుడు తన బుద్ధిని కేంద్రీకరించి స్త్రీలో చలనం కలుగజేయాలి. ఆమెలో వుద్రేకం మొలకెత్తించాలి. ఇందుకు గిలిగింతలు, చమత్కార సంభాషణలు సహాయం చేస్తవి. స్త్రీని ఉద్రేకపూరితురాలుగా జేసి పురుషుడు రతి ప్రారంభించాలి. ఇట్లుచేసినగాని స్త్రీని పురుషుడు తృప్తిపరచజాలడు.

ఇక రతి—చాలమంది యువకులకు 'శోభనం' నాడు ఏవిధంగా ఈ సృష్టికార్యమునకు ఉపక్రమించవలెనా అనేది వేధించి, బాధించే ఒక గొప్పసమస్య. ఈ సమస్యాపరిష్కార మార్గం తెలిసికొనటం వివేకలక్షణం. ఇందుకు కళారహస్యాలను చదివి గ్రహించటం అవసరం. యౌవనం పొడసూపినపుడు ఈ పుస్తకపఠనం ప్రారంభించాలి ఈ కార్యం తప్పు కాదు. కళారహస్యాలను తెలిసికొని అందులోని విలువలను గ్రహించటం సృష్టికార్యంలో ఒక సుఖసోపానం ఎక్కటమే. అధరచుంబనం, స్తనస్పర్శ, కౌగిలింతలు, ఈ ఆనందంలోని కొన్ని ఘట్టాలు. స్త్రీజాతులను విపులంగా అర్థం చేసికొని తదనుగుణ్యంగా మెలగితేనేగాని రసికుడు కాలేడు.

ఇక గమనించవలసినది ప్రదేశము, పరిసరములు— 'తొలిరేయి, తొలిసంగమం' సౌఖ్యం తిరిగి లభ్యం కాదు. అందుకు కలయికకై నిర్దేశింపబడి మనోజ్ఞంగా అలంకరించ బడిన ఆ ప్రదేశమే—ఆ గదియే కారణం. పరిసరములు

పరిశుభ్రముగా వున్నప్పుడు నూతనోత్సాహం కలుగుతుంది. అట్టి ఉత్సాహము దంపతుల ఆనందమును ఇనుమడింప జేస్తుంది. అందుకోసమే పాన్పు వేయుటకు నిర్దేశించబడిన గదిని మనోహరంగా, శృంగారమయంగా, ఆకర్షణీయంగా అలంకరిస్తారు. ఇట్టి వాతావరణములో సృష్టికార్యం జరపబడునేది ఈ మూడురాత్రులే! అందుచేతనే "శోభనపునాటి రాత్రి" పొందిన ఆనందమును ప్రతి వ్యక్తి సంతోష సమయంలో స్మరించటం విదితమే. తదుపరికూడా ఇట్టి మధురానుభూతిని పొందుటకు ప్రత్యేక గదిని నిర్ణయించుకొని, దానిని సుందరంగా అలంకరించటం దంపతుల ధర్మం. గదిలోని తమ సంభాషణ ఇతరులకు వినపడకుండుటకు ఒకమూలగానున్న గదిని వాయురాకకు అడ్డులేనిగదిని నిర్ణయించుకోవాలి. ఇది అతి జాగ్రత్తగా గమనించవలసిన విషయం. పొరపాటు, లోటు, జరిగితే ఆశించిన ఫలితాలు అందుబాటులోనికిరావు. నాలుగు గోడలమధ్య నలుగురు వింటారేమోనని మాట్లాడటానికి మధనపడుచూ కండ్లుమూసికొని ఈ కార్యం జరపటం హేయమని భావించాలి. ఆ వాతావరణంలో ఈపవిత్రకార్యం జరపటం హేయమని గ్రహించి నిగ్రహించటం మంచిది. పండు వెన్నెలలో, పరిశుభ్రమైన మలయమారుతమును గ్రోలుచు రతిక్రీడలోని రమ్యత్వం చవిచూచేవారు ధన్యులు. ఇట్టి పరిస్థితులకై ప్రాకులాడి ప్రయత్నించి ప్రయోజనం పొందండి. నాడు దాంపత్య జీవితంలో చంద్రోదయమగుట తప్పదు.

ఈ విధంగా ముందు జాగ్రత్తవహించి భావిజీవిత సౌఖ్యానికి పునాదులు నిర్మించుకొనేవారు బహుకొద్దిమంది. కొందరికి, ఈవిషయంలో ప్రత్యేక శ్రద్ధ అనవసరమని, కొంద రికి ఈ అమూల్య గ్రంధాలు తెలియక, లభించక, ఏదో విధంగా జీవితయాత్రను చేస్తున్నారు. మరికొందరు దీనిని నీచంగాభావించి మౌనం దాల్చుచున్నారు. అల్పసంఖ్యాకులు మాత్రం విజ్ఞానవంతమైన ఈ విషయాన్ని తెలిసికొని రసి కులు అగుచున్నారు.

రాత్రిలోచాలాభాగం గడిచినది. చదువుచాలించి రఘు పండుకొన్నాడు. చల్లగాలి లోనికివచ్చుటకు కిటికీలు తెరువబడియున్నవి. ఆ చల్లని వాయువు బుజ్జగింపుతో రఘు మైమరచి నిద్రించాడు.

# 15

ఉదయం అయినది. ఆగృహంలో ఉత్సాహం మూర్తీభవించినది. విజయ, రఘులకు తలంటి పోసినారు. వారు నూతన వస్త్రములు ధరించారు. రఘు మేడమీద మిత్రులతో ముచ్చటిస్తున్నాడు. కాని వాని ధ్యానంమాత్రం ఎక్కడెక్కడో సంచరిస్తున్నది. సంభాషణలలోని చమత్కారానికి మిత్రులు తమలోతాము నవ్వుకొంటున్నారు. వారితో రఘు శ్రుతి కల్పినాడు. విజయ క్రింద హాలులోని ఒక గదిలో కూర్చున్నది. మనస్సు తికమక పడుచున్నది. ఏకాభిప్రాయమునకు రాలేక పోవుచున్నది. రాత్రి జరుగ బోవు కార్యం తలచుకొనేసరికి ఆమెలో ఆవేదన ఎక్కువగుచున్నది. హృదయము వేగముగా కొట్టుకొనుచున్నది. గదిలో ఆమెతప్ప ఇతరులులేరు. అందువల్లనే ఆమెలోని ఆలోచనలు స్వేచ్ఛగా సంచరిస్తున్నవి.

పగలు జరగవలసిన కార్యము ముగిసినది. ఇక గర్భాదాన కార్యక్రమం జరుగవలెను. సాయంత్రం వేణు, రామం, పట్టణ గ్రంథాలయమునకు పోయినారు. అచట రామం తనకు కావలసిన పుస్తకములు తీసికొనినాడు. రఘు, ప్రసాదు బజారుకుపోయి కొన్ని వస్తువులు కొన్నారు. అందరూ తిరిగి వచ్చారు. రాత్రి భోజనాలు ముగిసినవి. పదిగంటలకు

గర్భాధాన కార్యక్రమం. పురోహితుడు తాను చేయవలసినవి, వారిచే చేయించవలసినవి అన్నీ పూర్తిచేయించాడు. గదిలోనికి విజయను పంపి ముత్తైదువలు ఒక్కరొక్కరే జారుకొన్నారు. కాని కొందరు కొంటెవాండ్రు వారెట్లా సంచరిస్తారోయని తలుపు సందులోనుండి తొంగిచూస్తున్నారు.

విజయ గదిలోనికి వచ్చినది. సిగ్గుచేత వంచిన శిరము ఎత్తలేదు. గదిని విద్యుద్దీపకాంతి ఆవరించినది. కిటికీ సమీపమున శయ్య అమర్చబడినది. కిటికీ తలుపులు తెరిచినచో తోటలోని గాలి లోనికి వచ్చుటకు వీలున్నది. శయ్యమీద మల్లెలు విరివిగా చల్లబడియున్నవి. గదిలో ఘుమ ఘుమలు. శయ్యకు సమీపమున నున్న టేబిల్‌పై రేడియో—దాని ముందు కుర్చీయున్నది. మరియొక టేబిలుపై ఫలహారములుంచబడినవి. రేడియోముందు కూర్చొని రఘు గీతామంజరి వినుచున్నాడు. విజయ లోనికి రాలేదేమా యని చూస్తున్నాడు. విజయ క్రీగంట రఘుని, పడకటింటి అలంకారమును చూచినది. పరిసరముల ప్రభావము, మనసు నుద్యుక్తపరచినది. రఘు తిరిగిచూచుటలో విజయ కన్పించినది. కుర్చీనుండి లేచి విజయను సమీపించాడు. వారిహృదయాలు వేగంగా కొట్టుకొంటున్నవి. విజయ తలను పైకెత్తి రఘు ఆ వదనంలో సుధాకరుని వెలుగు చూచినాడు. విజయకూడా

అదే సమయంలో పతిలోని భావజాలమును గ్రహించినది. విజయ హృదయం లోపల భర్తకు ఉత్సాహముగాను, అనుకూలముగాను చరించవలెనని కోరిక. కాని సిగ్గు ఆవరించి ఆమెను అట్లా చేయించలేకపోయినది. లొంగిపోతావంటూ మనస్సు హెచ్చరిస్తున్నది. కాని వుద్రేకం వాటిని నిర్లక్ష్యం చేసినది. రఘు విజయను పడకమీాద కూర్చోబెట్టి తను ప్రక్కన కూర్చున్నాడు. "విజయా, కూర్చో." విజయ కూర్చోలేదు. రఘు బలవంతంమీాద విజయను శయ్యమీాద కూర్చుండేటట్లు చేశాడు. తిరిగి 'విజయా' అని రఘు పలకరించాడు. కాని ప్రత్యుత్తరం శూన్యం. రఘు విజయను చక్కిలిగిలి పెట్టాడు. విజయకు నవ్వు ఆగలేదు. విజయ నవ్వుచూ రఘుపై వ్రాలినది. వారిరువురి పెదవులు కలిసికొన్నవి. ఆతడు మన్మధుడు. ఆమె రతీదేవి. ఇక వారు చేయబోయేది పవిత్రమైన సృష్టికార్యం. అతడు కామకళాసూత్రములను అవగతంచేసికొన్న రసపిపాసి.

"విజయా! దాహమగుచున్నది. మంచినీరు కలదేమో చూడు." విజయ లేచి టేబిల్పైనున్న మరచెంబులోని నీరు గ్లాసులో పోసినది. రఘు ఆమెను వెంబడించి, టేబిల్ ముందున్న సోఫాలో కూర్చొని 'ఏమిటిది విజయా' అంటూ అచ్చటవుంచిన పలహారములలో ఒకదానిని తీసి

విజయను ప్రశ్నించాడు. విజయ చెప్పలేదు. రఘు ఊరు కొనక "పేరుచెప్పకున్నా తినటంమాత్రం తప్పదంటూ" విజయను సోఫాలోనికి లాగి ఆమె నోటి కందించాడు. విజయ దానిని చేతితో అందుకొని రఘునోటిలో నుంచెను. సతి ప్రేమతో పెట్టినదానిని పతి స్వీకరించి తన అనురాగాన్ని ఆమెకు అర్థమయ్యేటట్లుగా పళ్ళెములోనుంచిన ఫలహారము లలో ఒకదానిని తీసి ఆమెకు అందించాడు. ఆమె దానిని ఆరగించినది. అచట ఉంచబడిన ఫలహారములలో కొంత భాగం ఖాళీ ఐనది. విజయ మంచినీటిని రఘుకు ఇచ్చినది. రఘు ఆ నీటిని త్రాగాడు. విజయ అందించిన గ్లాసులోని పాలను పూర్తిగా త్రాగక రఘు మిగిల్చి, బలవంతంచేసి, విజయచేత త్రాగించాడు. విజయ త్రాగక తప్పలేదు. తమలపాకుల ఈనెలుతీసి, సున్నమురాసి భర్త కందించినది విజయ. అందుకొనుటలో రఘు విజయ వ్రేలును కొరికినాడు. 'అబ్బా' అని విజయ బాధ నటింపగా రఘు "వ్రేలేది. ఊదుతా" నంటూ విజయను ముందుకు లాగి కౌగిలిలోనికి తీసికొన్నాడు. ఆ కౌగిలింతలో . వాని చేతులు నునుపగు విజయ వక్షస్థలమును స్పృశించినవి. విజయ సిగ్గుపడినది. కాని, రఘు మౌనం దాల్చక ముందడుగు వేసి ఆమెను ఉద్రిక్త పరిచాడు—సృష్టికార్యంపట్ల సుముఖురాలుగా చేశాడు. కిటికీగుండా చల్లనిగాలి విసురుగా లోనికి వస్తున్నది.

సోఫానుండి సతీపతులు శయ్యను చేరుకొన్నారు. వారు ఏమేమో చెప్పుకొని నవ్వుకొనుచున్నారు. ఆ సమయంలో జోక్యం పుచ్చుకోవటం సబబుగా నుండదు. పైగా ఇతరులు చూస్తున్నారేమో నని వారు బిడియ పడతారు. వారి వుత్సాహం సన్నగిల్లుతుంది. అందుకోసమే వారిని ఏకాంతంగా వదలి ముందుకు సాగుదాం.

... ... ... ...

అన్ని విషయాలు చర్చించాం. ప్రభావతీ ప్రసాదులకు పరిణయమైనది. వితంతువు అన్నపూర్ణను చేపట్టి, రామం ఆమె జీవితంలో పున్నమ వెన్నెలను చూపించాడు. విజయ, రఘు, హృదయ క్షేత్రాలలో మొలకలెత్తిన భావజాలాన్ని గ్రహించి వారిరువురిని నూతనానందాన్ని పొందేటట్లు చేశాము. ఇక చే య వ ల సి న ది ఏమీ లేదు. తిరిగి "వివాహం"లో మిమ్ము కలిసికొంటాం.

———